# అందరికీ నమస్కరించి

శ్రీవాణి ద్వితీయ వార్షికోత్సవం సహృదయుల సహకారంతో విజయవాడలో విజయవంతంగా జరిగింది ఆహ్వానసంఘ అధ్యక్షులు శ్రీ కోనేరు రామచంద్రరావు కార్యదర్శి శ్రీ యద్దనపూడి చిరంజీవరావు జర్నలిష్టు శ్రీ యం సుబ్రహ్మణ్యం శ్రీ యల్ వి పూర్ణచంద్రరావు శ్రీ జె రాఘవేంద్రరావు శ్రీ చంద్రం మరియు శ్రీ యస్ యస్ వాజపాయి వారి బృందం వారు అందించిన సహకారం ప్రశంసనీయమైనది అంతేకాదు ప్రత్యేక సంచికకు అడ్వర్‌టైజ్‌మెంట్సు అందించిన సహృదయులు జీవిత సభ్యులుగా చేరి సహకారం అందించిన పెద్దలు రచనలు అందించిన రచయితలు సంవత్సర కాలెండర్ వేసి ఇచ్చిన శ్రీ యస్ యన్ దుర్గారావు ఇంకా ఎందరో కార్యకర్తలు అందించిన సహకారం అపారమైనది

చందాలు సకాలంలో పంపి సహకారం అందించిన వారుకూడా ఎందరో ఉన్నారు వారందరికి నా కృతజ్ఞతాభివందనలు

## 'శ్రీవాణి' జీవిత సభ్యులు

శ్రీ ఐ ఎస్ ఎస్ హెచ్ ప్రసాద్
జబల్‌పూర్

శ్రీ మండవ రత్తయ్య
కమలేంద్ర ప్రింటింగ్ ప్రెస్ విజయవాడ

శ్రీ యెనిమిరెడ్డి బక్కిరెడ్డి జ్ఞానకార్థం
శ్రీ యెనిమిరెడ్డి జగన్నాథరెడ్డి విరాళం
నందిగామ

★

గమనిక పై శ్రీవాణి జీవితసభ్యుల పేర్లు ప్రత్యేక సంచికలో సరిగా ముద్రించలేదు ఇప్పుడు మార్పుచేయడమైనది పొరపాటును క్షమించ ప్రార్థన

## మనవి

ఇకపోతే చందాలు పంపని వారు షుమారు 960 మంది దాకా ఉన్నారు వారందరికి కార్డులు ప్రింటు చేసి పంపాలంటే చాలా ఖర్చు భరించవలసి వస్తుంది పోస్టల్ రేట్లు పెరగడం వలన ఒక కార్డు ప్రింటు చేసి Post చేయాలంటే 60 పైసలదాకా ఖర్చు అవుతున్నది అందువలన 15 పైసల కార్డుల మీద నా స్వదస్తూరితో వ్రాసి Post చేస్తున్నాను ఇప్పటి వరకు షుమారు 500 కార్డులు ఆ విధంగా వ్రాసాను ఫిబ్రవరి 15వ తేదిలోపల మిగతా వారికి కూడా వ్రాయ సంకల్పించాను ఇది ఎంత శ్రమతోకూడిన విషయమో సహృదయంతో అర్థంచేసుకొని వెంటనే చందాలుపంపి సహకరిస్తారని ఆశిస్తున్నాను అప్పటికీ చందాలు పంపనివారికి పత్రికను నిలుపుదల చేయడం సముచితమేమో ! ఆలోచిస్తున్నాను అన్యధా భావించక నా కార్డును అందినవారు సహృదయంతో ఆలోచించి సముచితమైన సహకారం అందించి సాహిత్య ఆధ్యాత్మిక ప్రచారానికి తోడ్పడుతారని ఆశిస్తున్నాను ఎన్నో సంవత్సరాలపాటు తెలుగువారికి సాహిత్య సేవ చేసిన భారతి లాంటి మాస పత్రికను పాఠకుల సహకారం లేకపోవడం వలన నిర్వాహకులు నిలిపివేసారు ఇది అత్యంత విచారకరమైన విషయం అటువంటి స్థితి శ్రీవాణి కి రాకుండా చేయాలనేదే నా ప్రయత్నం భగవాన్ శ్రీ సత్య సాయి బాబా గారి ఆశీస్సులను పొందిన నా శ్రీవాణి కి అటువంటి పరిస్థితి ఏర్పడదని నా నమ్మకం ఎన్నికష్టములనైనా ఎదిరించి శ్రీవాణి ని ప్రతినెలా పాఠకులకు అందిస్తానని వాగ్దానం చేసున్నాను సహృదయులైన పాఠకుల సహకారమును అర్థిస్తున్నాను చందాలు పంపకపోవడానికి కేవలం అశ్రద్ధేనని నాకు బాగా తెలుసు అంతకుమించి మరే కారణం ఉండదని నేను అభిప్రాయ పడుతున్నాను ఈ పత్రిక నిర్వహణలో పడుతున్న యిబ్బందులను సహృదయంతో సదవగాహన చేసుకొని సకాలంలో సముచితమైన సహకారం అందించి నాలుగు కాలాలపాటు శ్రీవాణి ' ఒక మంచి పత్రికగా నడవడానికి చేయూత నిస్తారని ఆశిస్తున్నాను ధన్యవాదాలు

— కొమరగిరి కృష్ణమోహనరావు
ఎడిటర్

ఫిబ్రవరి - 1987

సంపుటి 3

సంచిక 2


# శ్రీవాణి


సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ 2818


| | | |
|---|---|---|
| విడి ప్రతి | రు | 3-00 |
| సంవత్సర చందా | రు | 36-00 |
| 2 సం॥ల చందా | రు | 66 00 |
| 4 సం॥ల చందా | రు | 116-00 |
| జీవిత సభ్యత్వం | రు | 500-00 |

Cheques & Drafts should be drawn in favour of SREEVANI Monthly Machilipatnam


EDITED PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక



* ముఖచిత్రం *

ది 12-1-1987న విజయవాడలో జరిగిన "శ్రీవాణి" ద్వితీయ వార్షికోత్సవ దృశ్యాలు

# సహకారం అందించిన సహృదయులకు కృతజ్ఞతాభివందనలు

నా శ్రీవాణికి రెండు సంవత్సరాలు పూర్తి అయినాయి జన్మదినోత్సవం చేసుకుంటున్నాం ఆ జన్మదినోత్సవ మహోత్సవంలో మీరందరూ సంతోషంగా పాల్గొని ఆశీస్సుల నందించడానికి యిక్కడికి విచ్చేశారు అంతేగాదు భగవాన్ శ్రీ సత్య సాయిబాబా గారు మనం యిక్కడ కనిపించకపోయినా యిక్కడనే వున్నారని ఈ మహోత్సవాన్ని తిలకిస్తున్నారనే విశ్వాసం నాకున్నది నా శ్రీవాణిని మననారా దీవించి ఆశీస్సులనిచ్చి స్ఫూర్తినిచ్చి చైతన్యంతో నడిపిస్తున్నటువంటి భగవత్స్వరూపులైన బాబాగారి పాదపద్మములకు నమస్కరిస్తున్నాను ఎందువలనంటే ఇటువంటి పత్రికను నడపడం చాలా కష్టం అయినప్పటికి బాబాగారు యిచ్చిన స్ఫూర్తి కలుగచేసిన ఆత్మ విశ్వాసం పెట్టిన ప్రసాదముల వలననే నేను శ్రీవాణిని నడుపగలుగుతున్నాను

ఈ దేశంలో సహకారం అందించ గల సహృదయులకు కొదవలేదు అయితే చాలామందికి పత్రికా నిర్వహణలో నున్న యిబ్బందులు తెలియక పోవడం వలన స్తోమత వున్నప్పటికీ సహకారం అందించలేకపోతున్నారు శ్రీవాణిని పెట్టిన తరువాత రీముకు రు 30/ లు న్యూస్ ప్రింట్ పెరిగింది ముద్రణరేట్లు పోస్టల్ రేట్లు పెరిగాయి పత్రికా నిర్వహణ అంత తేలికగా నిర్వహించడంలేదు అయినప్పటికీ క్రమం తప్పకుండా సకాలంలో యిప్పటికి 24 సంచికలు పాఠకులకు అందించాను

ఈ వార్షికోత్సవ సందర్భమున విజయవాడ పట్టణంలో కొంతమంది పెద్దలను కలిశాను గత రెండు సంవత్సరాలుగా వారికి పత్రిక పంపిస్తున్నాను వారి దగ్గరికెళ్ళి డబ్బు అడుగలేదు కొంతమంది సహృదయులు వారంతట వారే చందాలు పంపించారు చాలామంది పంపించలేదు నేను అనుకున్నాను గదా! వీరికి యిష్టం లేదేమో! అసలు శ్రీవాణి వీరి దృష్టికి చేరుతున్నదో లేదో! నా పిచ్చి వ్యామోహంతో నేను పంపిస్తున్నానేమో! అని అనుకొని 150 మంది పెద్దలను కలుసుకున్నాను నా భావన తప్పని భావించాను ఎంతో మంది పెద్దలు ఆత్మీయతతో ఆదరంతో నన్ను ఆహ్వానించారు నీ పత్రికను నేను చదవడమేగాక మా ఇంటిల్లిపాది చదువుతున్నామని చెప్పారు అయితే పేపరు వచ్చినప్పుడు చందా పంపిదామనుకుంటాం తరువాత మరచిపోతాం అంతకు తప్ప మరో ఉద్దేశ్యం లేదన్నారు అంతేగాదు వారి చేతులలో నున్న అడ్వర్‌టైజ్‌మెంటునో జీవిత సభ్యత్వమునో యిచ్చి ప్రోత్సహించారు నేను ఈనాడు ఆనందంతో స్ఫూర్తితో విశ్వాసంతో మీ ముందు మాట్లాడుతున్నాను ఎంతో మంది పెద్దలు ఆదరంతో ఆహ్వానించారు మా ఇంటికి రావాలన్నారు భగవాన్ సత్యసాయిబాబా గారి విషయాలు మీపత్రికలో వేస్తున్నారు ఆ విషయాలను తెలుసుకోవడానికి మా ఇంటికి ఆహ్వానిస్తున్నామని ఎందరో చెప్పారు వెళ్ళాను ఒక్కొక్క ఇంట్లో కనీసం ఒక గంట సేపు అనేక మంచి విషయాలమీద చర్చ కొనసాగింది ప్రేమతో ఆనందంతో ఆత్మీయతతో ప్రత్యేక సంచికను తీసుకొని రావడానికి చేయూతనిచ్చి సహకారం అందించిన సహృదయులకు నా కృతజ్ఞతాభివందనలు నాకు సంపూర్ణమైన విశ్వాసం ఆనందం ఈనాడు కలిగింది నేను చేస్తున్న పని చక్కని పని అని ఆదరిస్తున్నారనే ఆనందంతో మాట్లాడుతున్నాను ఈ స్ఫూర్తి నాకు మొదలు పెట్టినప్పుడు లేదు ఈ 20 రోజులలో ఆ అనుభూతిని పొందకలిగినాను ఎందువలనంటే ఈ రెండు సంవత్సరాల నుండి నేను పడుతున్న బాధను వ్యధను ఈ 20 రోజులలో మరచిపోయాను అయితే ఇది పత్రికా నిర్వహణకు చాలదు ఇంకా విస్తృతంగా పోవాలి మీ అందరిని ప్రాధేయ పూర్వకంగా కోరుతున్నాను ఈ Experiment లో గనుక నేను ఓడిపోతే మరొకరు ఇటువంటి పత్రికను తీసుకొని రావడానికి ప్రయత్నించరని ఘంటాపథంగా చెబుతున్నాను ఇది గర్వంతో చెప్పే విషయంగాదు మరచిపోకండి ఎందువలనంటె మీరొక్కరే గొప్పవారా? అని అడుగుతారేమో? నేను ఆర్థికంగా గొప్పవాడిని కాకపోయినప్పటికీ, నా కున్నటువంటి స్నేహితబలం ఆత్మీయుల బలం అటువంటిది అయినప్పటికీ నేను ఊగిసలాడుతున్నాను భయ కంపితుడ నవుతున్నాననే విషయం మరచిపోకండి అయినప్పటికీ పత్రికను తీసుకొని రాగలుగుతున్నాను

చాలామంది ఈనాడు మంచి సాహిత్యం రావాలి సాంస్కృతిక విలువలు పెరగాలి ఆధ్యాత్మిక చింతన ప్రబలాలి నైతిక ఆధ్యాత్మిక శీల సంపత్తులు యినుమడింప జేయాలి అని అందరూ భావిస్తునే ఉన్నారు కాని వాటిని పెంచడానికోసం మన వంతు బాధ్యతను స్వీకరిస్తున్నామా ? అని ప్రతి ఒక్కరూ ఆత్మ విమర్శన చేసుకోవలసిన అవసరం కూడా ఉన్నదేమో ! మాటలు చెప్పనందువలన పెంగదు ఇక్కడ కూర్చొన్నవారు ఆ విషయం గురించి ఆలోచిస్తున్నవారు కావడం వలననే యిక్కడకి రాగలిగారు కాని సమాజంలో ఒక విధమైన మార్పును తీసుకొని రావలసిన అవసరం వున్నది మన జాతి చరిత్రను విస్మరించేటటువంటి దుస్థితి భావితరాలకు పట్టబోతున్న దనడంలో ఎమాత్రం సందేహం లేదు వివేకానందా ! ఎవరు? అనేటటువంటి ప్రశ్నించే సమయ మాసన్న మవబోతున్నదనే విషయం మరచిపోకండి కాబట్టి భావితరాలకు భారతదేశ ఉజ్జ్వల చరిత్రను అందించవలసిన బాధ్యత మనమీద ఉన్నది

Home is the First School For children (పిల్లలకు ఇల్లే ప్రథమ పాఠశాల) అని పెద్దలు ఏనాడో చెప్పారు ఈనాడు ఆ ఇల్లు మంచి వాతావరణంలో వుంటున్నదా ? ఒకమాటు హృదయపూర్వకంగా ఆత్మ విమర్శన చేసుకుంటే అర్ధమవుతుంది ఈనాడు నవనాగరికులమని చెప్పుకుంటున్న వారి గృహాలు సెక్సు సాహిత్యంతోను క్షుద్ర సాహిత్యంతో సినిమా సాహిత్యంతో డిటెక్టివ్ నవలలతో నిండిపోతున్నదనే విషయం మరచిపోకండి భావితరాలకు అందించవలసినది ఇదేనా ? మన వారసత్వం ఇటువంటి స్థితిలో నేటి బాలబాలికలు చక్కటి భావిభారత పౌరులుగా ఎవిధంగా తీర్చి దిద్దబడుతారు ? ఆలోచించండి సంస్కృతం రాకపోవచ్చు రాజాజీ రామాయణం చదవండి శ్రీనివాస శిరోమణి వచన రామాయణాన్ని చదవండి శ్రీ సత్యసాయిబాబావారి సాహిత్యాన్ని చదవండి పెద్దలు, మహానుభావులు రచించి మనకందించి వెళ్ళిన వారి వచన సాహిత్యాన్నయినా ఇండ్లలో వుంచండి భావితరాలకు ఒక మంచి సందేశాన్ని అందించగలగండి ఇల్లు ఒక పవిత్రమైన గ్రంథాలయంగా రూపొందవలసిన అవసరం ఎంతైనా ఉన్నది ఇల్లు పిల్లలకు ప్రథమ పాఠశాలే కాదు తల్లిదండ్రులు వారికి ప్రథమ గురువులు (Parents are their First Teachers) అనే విషయం విస్మరించకండి ఇంకా పది సంవత్సరాలుపోతే మన పిల్లలు మన మాట వినరూ ! అనే విషయం మరచిపోకండి ఇప్పటికే చాలామంది పిల్లలు తల్లిదండ్రుల మాట లెఖ్ఖ చేయని స్థితికి వచ్చారనే విషయం విస్మరించకండి

పాశ్చాత్య వ్యామోహంలో అధునాతనమైన పోకడలతో మనదీ అనేటటువంటిది మొత్తాన్ని విస్మరించి ఎక్కడికి పోతున్నామో ! అనే దుస్థితి ఇప్పటికే అనేక ఇండ్లలో ఏర్పడింది కాబట్టి ఒక మంచి సాహిత్యాన్ని సాంస్కృతిక విలువలను ఆధ్యాత్మిక శీల సంపత్తులను యినుమడింప చేసేందుకు కృషి చేస్తున్నటువంటి శ్రీవాణి ని మనసారా ప్రోత్సహించండి ప్రక్కనున్న వారికి కూడా చెప్పి ప్రోత్సహించేటట్లుగా చేయండి విస్తృతప్రాతిపదిక మీద ప్రతి ఇంటికి శ్రీవాణి చేరుకొనేందుకు అవసరమైన సహకారమును అందించమని అర్ధిస్తున్నాను ప్రార్థిస్తున్నాను

ఈనాడు నన్ను నా శ్రీవాణిని భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు వేదిక నలంకరించిన జగద్గురువులు మరియు ఇంకా మహానుభావులు ఆశీర్వదిస్తున్నారంటే నేను భయపడుతున్నాను ఈనాడు నా మీద అమితమైన బాధ్యత పడిందని భావిస్తున్నాను ఎందువలనంటే ఇప్పటివరకూ ఆశీస్సులను పొందడానికి అర్హతను పొందినవాడను భవిష్యత్తులో అట్టి అర్హతను నిలబెట్టుకోగలనా ? అని భయపడుతున్నాను ఆ అర్హతను నిలబెట్టగలిగే ఆత్మవిశ్వాసాన్ని కూడా ఈ మహానుభావులు నాకు ప్రసాదిస్తారని ప్రసాదించమని నాలుగు కాలాలపాటు శ్రీవాణి ని దిగ్విజయంగా తెలుగువారికి అందించేటటువంటి శక్తి సామర్థ్యాలను కలుగజేయమని ఆ మహానుభావులను ప్రార్థిస్తూ ఇచటికి వచ్చి ఈ మహోత్సవంలో పాల్గొనిన వారిని ప్రత్యేకంగా అభినందిస్తూ ధన్యవాదాలర్పిస్తూ నేను శలవు తీసుకుంటున్నాను

కొమరగిరి

శ్లో॥ మృద్వీకా రసితా సితా సమశితా స్ఫీతం నిపీతంపయః
స్వర్యాతేన సుధాప్యధాయి, కతిధారంభాధరః ఖండితః ?
తత్త్వం బ్రూహి మదీయ జీవ భవతాభూయోభవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయోరయంమధురిమోద్గారః క్వచిల్లక్షితః ?

ఒక భక్తుడు తన జీవుణ్ణి సంబోధిస్తూ అన్నమాటలివి "ఓ జీవుడా! ఇప్పటిదాకా నీ కెన్నో జన్మలు సంభవించాయి ఎంతో అనుభవంకూడా సంపాదించావు ఒక్క విషయం అడుగుతాను చెప్పుమరి




ద్రాక్షపళ్ళు ఎంత మధురంగా వుంటాయో నీకు తెలుసు పంచదార యెంత తియ్యనిదో కూడా బాగా తెలుసు అలాగే చిక్కని మీగడ కట్టిన పాలుకూడా కమ్మగా రుచి చూచి వుంటావు అంతేగాక సంపాదించుకొన్న పుణ్యం వల్ల స్వర్గనివాసం నీకు లభించేవుంటుంది అక్కడ రంభ మొదలైన అప్సరసలతో సరస సల్లాపాలు నీవుసాగించావు వారి అధరామృత పానంలో మైమరచి వుంటావు కూడా అయితే ఈ రుచులన్నీ బాగా తెలుసుకదా నీకు అనుమానం లేదు ఏ మాత్రం అందుకని కపటం లేకుండా నిజం చెప్పాలి నీవు ఏమంటే

భగవన్నామం కూడా నీవు ఉచ్చరిస్తున్నావు కదా! కృష్ణ అనే రెండు అక్షరాల భగవన్నామాన్ని వుచ్చరించినపుడు కూడా అందులో ఎదో ఒక కమ్మని రుచి నీకు తోచి తీరాలి అయితే ఎమిటంటే ఈ కృష్ణ పదోచ్చారణంలోని మాధుర్యం పైన చెప్పిన ద్రాక్షాదుల్లో వుందేమో చూచావా పరిశీలించి? అని యీ విధంగా భక్తుడు అడిగాడంటే ఎమిటి దీని భావం ? పైన చెప్పిన సుఖాలన్నీ అనిత్యాలు ఆభాసలు అవి మీనాల మీది తేనెల వంటివి అని చెపుతూ భగవన్నామోచ్చరణం లోని పారవశ్యం వల్ల కలిగే సుఖం మాత్రం నిత్యం పరమానంద సంధాయకం అని ఆ భక్తుడు మానవులందరికి ఒక దివ్య సందేశమిస్తున్నట్లుంది

భగవన్నామంలో రుచి మరగిన మనస్సు ఇతర విషయాల పైకి వెళ్ళమన్నా వెళ్ళదు అందుకనే భక్తుడైన రామదాసు 'ఓరామ నీ నామమెంత రుచిరా?" అని కొనియాడుతూ ఈ పాలు-మీగడ పంచదార వీటన్నింటి కంటే అద్భుతమైన రుచి గలది ఆ నామం అని అన్నాడు

ఇదే విషయాన్ని దృఢపరుస్తూ అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేష మత్త చిత్తము ఏ రీతి నితరంబు చేరనేర్చు" అని అన్నాడు పోతన మహాకవి దీనివల్ల నిత్య సత్యమేమిటో తెలుస్తోంది

మానవుడు నిత్య స్థిరమైనదాన్ని పొందటానికి ఆరాటపడాలి కాని కేవలం వినశ్వరమైన క్షణికములైన సుఖాల కోసం కాదు ఏ భక్తుడు గాని ఏ జ్ఞానిగాని వారివారి అనుభవంతో మనకు చెప్పిన దివ్య సందేశం "నామస్మరణాదన్యోపాయం నహి పశ్యామో భవతరణే" అనేది ఆ భావాన్నే మహాకవులు తమ రచనల్లో ప్రబోధిస్తారు



# మతము, వేదాంతము, రాజకీయములు ప్రచారం చేస్తున్న

# శ్రీవాణి కి సహకారం అందించండి

— జగద్గురు శ్రీ త్రివిక్రమరామానంద భారతీస్వామి

**మతమును**, తత్వ శాస్త్రమును భిన్నంగా భావించడం పొరపాటు నేడు పూజా విశ్వాసముల విధానము మతమంటున్నారు పూర్వం మతమను పదము ఎంతో విశాలమైన యర్థమున నుపయోగింపబడినది నేడు గ్రుడ్డి నమ్మకమును కలిగించేది మతమని భావిస్తున్నారు సహేతుకముగా పరీక్షింపబడి నిరూపించబడనంత వరకునూ ఏ విషయమును నమ్మకుండుట తత్వశాస్త్రము యొక్క పద్ధతిగా చెప్పబడుతున్నది మతముకన్నా అధికంగా తత్వ శాస్త్రము శాస్త్రీయముగా నుండునని చెప్పబడుచున్నది జీవితముయొక్క గాఢ సమన్వయ విశ్వము యొక్క గూఢ వైచిత్రమునకు సమాధానం మతమువలన లభించదని భావించబడు తున్నది ఇది ఎమాత్రం వాస్తవం కాదు, యదార్థం అంతకన్నా కాదు

బోధ పూర్వకమైన విశ్వాసము ఎవనికి ఎంత ఉండునో దానినిబట్టి ఆ వ్యక్తి మతము నెడల గల దృక్పథము నిర్ణయించబడుచున్నది సంప్రదాయములు ఆచారములు మతమునందలి విశ్వాసమును స్థిరమొనర్చుటకు చాలావరకు దోహద మొనర్చుచున్నవి మతమన్నది యంతయు అంధ విశ్వాసమేయని విమర్శించుట నేడు పరిపాటిగా నున్నది విశ్వాసమును అణచివేయరాదు మనము ఆశించుచున్న విషయములకు సారభూతమైనదియు (Substance) మనకు కన్పించని వానికి నిదర్శనమైనదియు విశ్వాసమే కావున విశ్వాసము వలననే మనము మన లక్ష్యములను సాధించగలుగు చున్నామని గ్రహించాలి శాస్త్రమునందు పెక్కుయంత్రనిర్మాణములలో విశ్వాసమే ప్రారంభస్థానమై యున్నది దీనినెప్పుడును నిరాకరించుటకు వీలు లేదు

వస్తు స్వరూపమును తెలుసుకో వలయునను కోరికతో మనము దేనిని గూర్చి ప్రశ్నింప నారంభించినను, ఆ క్షణమే మనము తత్త్వ శాస్త్ర రంగమున ప్రవేశించుచున్నామన్నమాట కాబట్టి మతము తత్త్వ శాస్త్రము రెండు భిన్న విషయములని చెప్పుటకు వీలులేదు అని పరస్పరాశ్రితములు అంతేకాదు అవి నిజముగా ఒకటే రెండు కాదు ఎప్పుడైనను, ఎక్కడైనను మన బుద్ధి మనకు సంతృప్తిని కలిగింపనప్పుడు, హేతువాదము తత్త్వ విరుద్ధములు అనిశ్చితములునైన భావముల సీమలో దింపుచున్నప్పుడు మనము సాధారణముగా బుద్ధిపూర్వకముగానే మతముపై ఆధారపడుచున్నాము గాఢమైన బాధలో దుఃఖములో ఆశాభంగములో భగవంతుని గూర్చిన తలంపే మనకు ఊరటను గలిగించును ఏది సత్యమో, ఏది అసత్యమో గుర్తింపగలిగిన సామర్థ్యమే తప్పక శాశ్వతమైన సుఖమును పొందుటకు మార్గమును ఏర్పరుప గలదు కావున తత్త్వ శాస్త్రమనగా తత్త్వమును గుర్తించుటకు ప్రయత్నించుటయే

భారతదేశంలోని రాజులు రాజకీయములతో పాటు ధర్మమునందును శ్రద్ధవహించెడివారు రాజనీతియను శాస్త్రమునకు ప్రాణమును ఆస్తిని పరిరక్షించుటయే ప్రాథమి లక్షణము పరిపాలన యొక కళ ప్రతివ్యక్తి ప్రజలను పాలింపజాలడు వేదాంతమునకు రాజ విద్య అను పేరు కూడా కలదు పరిపాలకుడు వేదాంతియై యుండవలయును తన యధికారము శాశ్వతమని తలంపరాదు పరమేశ్వరునకు జీవునకు మధ్య ఎట్టి సంబంధమున్నదో, అట్టి సంబంధమే ప్రభుత్వమునకు, పాలితులకు

మధ్య నుండవలయును ఒక్క విద్యుచ్ఛక్తియే పెక్కు బల్బులలో ప్రసరించుచున్నది కాని బల్బులలోని భేదములను బట్టి ఒకవిద్యుచ్ఛక్తియే భిన్నభిన్నముగా కన్పించుచు భావింప బడుచున్నది పాలితులైన ప్రజలను బల్బులతో పోల్చవచ్చును

మనుష్యుడు ఏ పనినైనను ధర్మ బుద్ధితో చేయవలయును మనలను పరిపాలించుచున్న ఈశ్వరుడు పైననున్నాడని అతడు గ్రహించవలెను వేదములను ప్రమాణముగా గైకొని వానిలో చెప్పబడిన విధుల ననుసరించి వర్తింపవలయును అట్టి యాదర్శములను రాజ్యమునందు నెలకొల్పవలయును ఈ విధముగా మతము తత్వశాస్త్రము రాజకీయములు పరస్పర సంబంధముతో నున్నవని భేదముల మధ్యలో సామరస్యమును నిలుపుటకు ఆవశ్యకములగుచున్నవని మనము గ్రహింపవలయును

మతము వేదాంతము, రాజకీయములు సాహిత్యములను ప్రచారం చేస్తున్న శ్రీవాణి 'కి సహృదయులందరూ సహకారం అందించాలని కోరుతున్నాను ఇటువంటి పత్రికల అవసరం ప్రస్తుత సమాజానికి ఎంతైనా వున్నది అయితే ఈనాడు పోషించడానికి రాజులు లేరు ప్రజలే ఆ బాధ్యతను స్వీకరించాలి ప్రజల సహకారం మంచి పత్రికలకు లభించిననాడు మంచి సాహిత్యం వెలుగులోనికి వస్తుంది శ్రీవాణి ని స్థాపించి రెండు సంవత్సరములే అయింది మాకూ పంపుతుంటారు లోన చూస్తుంటాను అందరినీ మెంబర్లుగా చేసినా నన్ను చేయలేకపోయారు పోనీ యిప్పుడైనా ఒక వెయ్యినూట పదహార్లు యిద్దామనుకుంటున్నాను శ్రీవాణికి ఏదో చేద్దామనుకుంటుంటే అదేపనిగా ఆలస్యం అయిపోతున్నది ఆశ చాలావున్నది ఇంకా బాగుంటే వచ్చే ఈరోజులలో వుండేట్లయితే మరో వెయ్యి నూట పదహార్లు కూడా యివ్వాలని వున్నది అందులో అనుమానం లేదు మరొక పర్యాయం సర్వ దేవతలను ప్రార్థింబుతాను కనకదుర్గమ్మగారంటే మా స్వాములారికి మరింత ఇష్టం ఆఫొటో వేశారు కాబట్టి మరింత ఆనందంగా వుంది అందరూ కూడా ప్రతి ఒక్కరూ కూడా యివ్వవలసిన చందాల నిచ్చి శ్రీవాణిని ప్రోత్సహించమని కోరుతూ త్రికరణశుద్ధిగా ఆ అమ్మవారిని ప్రార్థించి మనవాళ్ళందరినీ ఆశీర్వదించమని కోరుతున్నాను (శ్రీవాణి ప్రత్యేక సంచికను ఆవిష్కరించి కర్తాళం పీఠాధిపతుల ఆశీస్సుల నందిస్తూ చేసిన ప్రసంగం నుండి ) ★

## "శ్రీ వాణి" జీవిత సభ్యులు



శ్రీ ... యస్. రాజు
ఎరీస్ కంపెనీ, విజయవాడ



శ్రీ ఎ వెంకటేశ్వరరావు, ప్రిన్సిపాల్
శ్రీవాణి బాల విద్యాలయం విజయవాడ



శ్రీ తాడేపల్లి బసవయ్య B A
మిల్లర్ మచిలీపట్నం

## మహోత్కృష్టమైన ఆశయాలను ప్రచారం చేస్తున్న

# శ్రీవాణి ని పోత్సహించం

– సుంకర

రెండు సంవత్సరాలనాడు జన్మించిన శ్రీ వాణి పత్రిక చిరుతప్రాయంలోనే మన రాష్ట్ర పరిధులను దాటి వివిధ రాష్ట్రములలో నున్న తెలుగు సాహితీ ప్రియుల అభిమానాన్ని చూరగొని ఆదరాభిమానాలను పొందిందంటే అతిశయోక్తి కాదు ఎవరియొక్క ప్రోద్బలం లేకుండానే వారంతట వారే చందాలు పంపిస్తూ ప్రోత్సాహ మివ్వడం ఊహించని పరిణామం నా అదృష్టం కొద్దీ శ్రీవాణి స్థాపించిన నాటి నుండీ వరుసగా అన్ని ఉత్సవాలలో పాల్గొనే సద్భాగ్యం నాకు కలిగింది రాసికాదు ప్రధానం వాసి ప్రధానం ఈనాటివరకు ముద్రించిన 24 శ్రీవాణి పత్రికల ముఖచిత్రాలను చూస్తే, ఈ పత్రిక యొక్క స్వరూపం ఏమిటో మనకు స్పష్టంగా నిర్ద్వంద్వంగా స్ఫటిక సదృశంగా మనకు కనపడుతోంది భగత్సింగ్ లాంటి త్యాగధనుడు, మహాత్మా గాంధీలాంటి జాతినేత, విశ్వకవి రవీంద్రనాథటాగూర్, స్వారాజ్యమే నా జన్మ హక్కని సింహ గర్జన చేసిన బాలగంగాధరతిలక్, ప్రపంచానికి భారత వేదాంత తత్వాన్ని వివరించిన The Greatest Philosopher of the World డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు రాజ్యాంగ నిష్ణాతుడైన డా॥ బి ఆర్ అంబేద్కర్‌ల ముఖచిత్రాలను ముద్రించి 24 పత్రికలు తయారు చేయడం సామాన్య విషయం కాదు ఏ చలనచిత్ర నటీమణినో ముఖ చిత్రం మీదవేస్తే బాగా అమ్ముడు పోతుందని పత్రికలు దిగజారి దౌర్భాగ్య నిర్భాగ్య దైన్య హైన్య నైచ్య మైన సంప్రదాయాన్ని నెలకొల్పుతున్నటువంటి తరుణంలో వాటినన్నిటిని విడనాడి మహోత్కృష్టమైన ఆశయాలను గుండెలలో నింపుకొని, చరిత్ర పుటలలో కలకాలంగా అమరంగా, అజరామరంగా నిలచే మహాపురుషుల చిత్రాలను ముఖ చిత్రంగా ముద్రించి అందించారంటే ఈ దేశ చరిత్ర సంస్కృతి సాహిత్యం, నాగరికత ఈ దేశం కోసం పాటుపడిన మహాపురుషుల దివ్య చరిత్ర ఈనాటి పాఠకుల హృదయాంతరాళాలలో వుండాలి అనే టటువంటి దీక్ష పట్టుదల కృష్ణమోహనరావులో వుండటం విశేషం అందుకే వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను

ఈనాడు గాంధీగారిని గురించి తెలియని బిడ్డలు ఎందరో ఈ దేశంలో వున్నారు ఇందిరాగాంధీకి మహాత్మా గాంధీకి తేడా తెలియని వారున్నారు ఇది నిజంగా దౌర్భాగ్యం ప్రతి పౌరుడికి మన దేశ ఉజ్జ్వల చరిత్ర తెలియాలి అసలు దేశ చరిత్ర అంటే ఏమిటి ? ఆయా దేశాలలో పుట్టి ప్రపంచానికి వెలుగు ప్రసాదించిన మహానుభావుల దివ్య చరిత్రయే ఆ దేశ చరిత్ర ప్రపంచ చరిత్ర కూడాను ప్రపంచానికి ఒక నూత్న సందేశాన్నిచ్చి ఆ దేశమును గురించి ప్రపంచం తెలుసుకొనే విధంగా మహోజ్జ్వలమైన కీర్తి ప్రతిష్ఠలను, ఆ జాతికి ఆ దేశానికి ప్రసాదించారంటే ఇది తెలుసుకో లేకపోవడం నిజంగా దురదృష్టకరం అనేక పత్రికలు ఈ మహత్తర చరిత్రను విస్మరించి క్షుద్ర సాహిత్యం సెక్స్ సాహిత్యాలతో విశేషంగా పాఠకులను ఆకర్షిస్తూ సొమ్ము చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న తరుణంలో కొమరగిరి ధైర్యం చేశారు ఈయన అనేక మహోద్య మాలలో నాతో కలిసి పాల్గొన్నారు ఆంధ్రోద్యమంలో, లోకనాయక్ జయప్రకాష్ సంపూర్ణ విప్లవ మహోద్య మంలో, రైతు సత్యాగ్రహాలలో పాల్గొని కాకలు తీరి, ఎదురు దెబ్బలుతిని కూడా ఏ మాత్రం వెనుకాడక ఒక

మంచిపని చేయాలని, సాహిత్యంలో క్రొత్త పరిశోధనలను చేయాలని మనదేశ ఉజ్జ్వల చరిత్రను భావితరాలకు తెలియ జేయాలనే లక్ష్యంలో ఒక్క అంగుళం కూడా చెదర కుండా, మొక్కపోకుండా ఎన్ని కష్టములనయినా భరిస్తూ ఒక మహోన్నతమైన లక్ష్యం కోసం ప్రయత్నిస్తున్నా రంటే ఇది ఎంత కష్టమైన విషయమో సహృదయులు గ్రహించాలి సహకారం అందించాలి

మన కృష్ణమోహనరావుకు కొద్ది మాసాల క్రితం భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీర్వచనం కూడా లభించడం నిజంగా అదృష్టం పూర్వం సాంస్కృతిక పత్రికగానో, సంపాదకీయాలలో రాజకీయ పత్రిక గానో లేక సాహిత్య పత్రికగానో మనం చూచిన శ్రీవాణి ' శ్రీ బాబాగారి ఆశీర్వచనంతో అది ఆధ్యాత్మిక పత్రికగా కూడా ఎంతో మందికి వెలుగును ప్రసాదిస్తున్నది ఎంతో మంది స్త్రీలు, పురుషులు సాయి సందేశాన్ని చదువు తున్నారు నేను కూడా చదివినప్పుడు నాకు ఆత్మావలోకనం కలిగింది ఒక దివ్యమైన అనుభూతి కలిగింది మనం ఎందుకు పుట్టామో? మన కర్తవ్యమేమిటో? తెలుసు కోవాలి అటువంటి జిజ్ఞాసను శ్రీవాణి ' కలిగిస్తుంద నడంలో ఎ మాత్రం అతిశయోక్తి లేదు ఇంతటి మహ త్తర ఆశయాలతో పత్రికను నడపడం చాలా కష్టం డబ్బుకావాలి డబ్బు లేందే పత్రిక ప్రంటుకాదు దీని కోసం అతను ఎంత కష్టపడుతున్నాడో నాకు తెలుసు ఆయనను ప్రోత్సహిస్తున్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారికి తెలుసు ఇది నిజంగా చాలా మహత్తరమైన కార్యం ఈ పవిత్ర కార్యక్రమాన్ని ముందుకు తీసుకొనిపోవడానికి సహృదయులందరూ సహకారం అందించాలని కోరు

తెలుగునాట జన్మించిన ఎందరో పాత్రికేయులతో పరిచయం చేసుకొనే మహద్భాగ్యం నాకు కలిగినది బందరులోనే వుంటూ పత్రికారంగంలో క్రొత్త వరవడిని సంప్రదాయాన్ని నెలకొల్పిన శ్రీ ముట్నూరి వా రి తో కూడా నాకు పరిచయం ఉన్నది ఇంకా ఎందరో మహా మహులైన పాత్రికేయులకు జన్మ స్థలమైన తెలుగునాట కృష్ణమోహనరావు గారి ' శ్రీవాణి కూడ స ము చి త మైన, మహోజ్జ్వలమైన స్థానాన్ని సంపాదించుకో కలి గిందని భవిష్యత్ చరిత్రకారులు వ్రాసే విధంగా ఆ పత్రిక వెలుగొందాలని ఆకాంక్షిస్తున్నాను ఆశిస్తున్నాను

నాచేత వెలిగించబడి నటువంటి ఈ చిరుజ్యోతి దివ్య జ్యోతిగా వెలుగొంది శ్రీవాణి తప్పకుండా తెలుగు ప్రజలను ప్రభావితంచేస, అచంద్రతారకంగా, చరిత్ర కారులు వ్రాసే విధంగా ఒక ఉన్నతమైన పత్రికగా కల కాలం నిలుస్తుందని ఆశిస్తున్నాను

( ది 12 1 1987 న విజయవాడ తుమ్మలపల్లి కళా క్షేత్రంలో జరిగిన శ్రీవాణి ద్వితీయ వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించిన కృష్ణాజిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ శ్రీ సుంకర సత్యనారాయణగారి ఉపన్యాసం నుండి ) ●

# సాంస్కృతిక విప్లవం రావాలి

— ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం

శ్రీవాణి వార్షికోత్సవానికి రమ్మనమని పిలువగానే అంగీకరించడానికి రెండు కారణాలున్నాయి నేను మొట్టమొదట ఉదయం లేవగానే ప్రార్థన చేసుకొనే మొదటి శ్లోకం 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ '' అని నన్నయ రచించిన ప్రథమ శ్లోకం మా ఇంటిపేరు "శ్రీవాణి' మా చిన్నమ్మాయి పేరు శ్రీవాణి' ఇలా "శ్రీవాణి" పేరుతో నాకున్న అవ్యాజమైన అనుబంధం ఈ "శ్రీవాణి" కార్యక్రమాలలో పాల్గొనడానికి నన్ను ప్రేరేపించింది మొట్టమొదటిసారి ఈ పత్రిక పేరు చూడగానే ఆకర్షితుడైన వారిలో నేనూ ఒకణ్ని రెండవ కారణం తెలుగులో సాహిత్య పత్రికలున్నాయి వార్తా పత్రికలున్నాయి వారపత్రికలున్నాయి సాహితీ ప్రక్రియలను పోషించే పత్రికలున్నాయి కొన్ని వైజ్ఞానిక పత్రికలున్నాయి కానీ సాంస్కృతిక పత్రిక అనేది ఒకటి ఉన్నదా? అసలు ఇటువంటి ఆలోచనను పత్రిక రంగంలో ప్రవేశపెట్టినవారున్నారా? అన్నది శ్రీవాణి మీద నాకు అభిమానం కలగడానికి దోహదం కలిగించింది

ఏ ప్రభుత్వానికైనాసరే ఆర్థికమైన రాజకీయమైన సాంస్కృతికమైన పాలసీలు ఉండాలి చాలావరకు ఆర్థిక రాజకీయమైన పాలసీలను ప్రకటించడం జరుగుతున్నది గాని మా ప్రభుత్వం యొక్క సాంస్కృతికమైన కార్యక్రమాలు యివి దానికి ఇటువంటి సిద్ధాంతాన్ని మేము పాటిస్తున్నామని స్పష్టంగా వ్యక్తీకరిస్తున్న వైఖరి మన దేశంలో కనిపించడం లేదు ఇటువంటి తరుణంలో ప్రజలలో సాంస్కృతికమైనటువంటి జాగృతిని కలిగించడానికి ఒక పత్రిక నడుం కట్టుకున్నదంటే నిజానికి గర్వించదగిన విషయం, హర్షించదగిన విషయం ప్రోత్సహించవలసిన విషయం

సంస్కృతి అంటే ఏమిటి? మానవుని జీవిత సమగ్రత్వాన్ని భావించేది సంస్కృతి మానవ సమగ్ర వికాసమును గూర్చినటువంటి ప్రయత్నమే సంస్కృతి అనబడుతుంది ఈ రోజు మానవుడు సమగ్ర మానవుడుగా వికసించడానికి వెనుకంజ వేస్తున్నాడు దానిని సమాజానికి Educate చేయవలసిన అవసరం ఎంతైనా వున్నది సమాజంలో ఇంద్రియ వికాసం ఉండవచ్చు మానసిక వికాసం ఉండవచ్చు బుద్ధివికాసం ఉండవచ్చు ఆత్మ వికాసం కూడా కావాలి ఈ నాలుగు రకములైన వికాసములతో కూడుకొన్న సమగ్ర వ్యక్తిత్వం సమాజానికి అందించడానికి సాంస్కృతిక మాస పత్రిక కృషి చేస్తుంది మన పత్రికలన్నీ పాక్షికమైన దృక్పథంతో తమతమ కర్తవ్యాలను నిర్వర్తిస్తున్నాయి ఇందాకటినుంచి పెద్దలన్నారు పత్రికల మీద వేసే బొమ్మలు లోపల చిత్రించేటటువంటి ఇంద్రియ సంబంధములైన అంశాలు ఇవి మనిషియొక్క ఇంద్రియాలను ఉద్రేక పరచడానికి మాత్రమే ఉద్దేశింపబడిన పత్రికలు ఏ సాహిత్యమైనా ఇంద్రియాలను ఉద్రేకపరచడానికే గనుక ఉద్దిష్టమైనట్లయితే అది చేసేంత హాని మరే సాహిత్యం చేయదు రెండవది హింస కూడా శాస్త్రీయమూ అని సంఘమునకు బోధించే పత్రికలు కూడా జాతికి మేలు చేయజాలవు ఈ విధంగా ఇంద్రియ ఉద్రేకముల ద్వారా సంఘంలో ఒక మానసికస్థితిని సృష్టించి దానివలన వచ్చే ఫలమైన డబ్బును తాను అనుభవిస్తూ జాతిని నిర్వీర్యం చేయడం దానివలన జరుగుతున్నది ఇక మనస్సుకు సంబంధించింది ఈ నాగరికమైన సమాజంలో బహు విషయముల మధ్య సంక్షోభం చెందుతున్నటువంటి ఈ మనస్సుకు కొంత విశ్రాంతిని కలిగిద్దామని కొన్ని పత్రికలు ముందుకు

వస్తున్నాయి ఈ పత్రికలు ప్రధానంగా కధలను జోక్స్‌ను తదితరముసైన కాలక్షేప సమాచారములను అందిస్తూ ఉంటాయి కథలను జాతి వర్తమానాన్ని దిద్దేట్లుగా ప్రచురించే పత్రికలు వేరు కధలను కాలక్షేపం కోసం ప్రచురించే పత్రికలు వేరు ఒక కధ చదువుతే ఒక జాతిలో ఒక చైతన్యం రాదు చాలా వరకు వారం అయ్యేసరికి వంద కధలు చదువుతాం ఈ వంద కధలూ మరి వచ్చే వారానికి మరచిపోతున్నాం ఎందుకు చదువుతున్నారంటే కాలక్షేపంకోసం చదువుతున్నారు మనస్సు మీద ఏ ముద్రా పడటం లేదు ఒక్క విషయం మాత్రం కలిగిస్తున్నాయి తరువాత ఏం జరుగుతుందో తరువాత ఏం జరుగుతుందో అనే Anxiety మాత్రం కలిగిస్తున్నాయి దీనివలన B P మాత్రం పెరుగుతున్నది

ఇకపోతే మేధకు సంబంధించినటువంటిది మన తెలుగు పత్రికలలో చాలావరకు వచ్చేది Informative Knowledge తప్ప Innovation Knowledge కాదు చాలావరకు విషయాన్ని తెలుసుకోవడానికే తోడ్పడుతున్నాయి గాని మనలో క్రొత్త ఆలోచనలు గాని క్రొత్త ప్రయోగాన్ని గాని వైజ్ఞానికంగా చేయడానికి వీలుండేటువంటి అంశాలు మనకు కనపడవు చాలావరకు పత్రికలలో ప్రసిద్ధులైన వారి జీవిత చరిత్రలో వారిని గురించిన అంశాలో Informative గా వస్తాయి అంతే గాని ఒక మహాత్ముని క్రొత్తగా సృష్టించేటటువంటి విజ్ఞానాన్ని కలిగించడం లేదు విజ్ఞానాన్ని నేర్చుకొనే పద్ధతిలోనే నడుపుతున్నారు గాని విజ్ఞానాన్ని ఉత్పత్తి చేసేటటువంటి ఒక క్రొత్త దృక్పధాన్ని క్రొత్త విజ్ఞానాన్ని అందించే స్థితిలో కూడా మన పత్రికలు లేవు

ఇక ఆత్మ విజ్ఞానానికి సంబంధించిన అంశం అక్కడక్కడ వున్నా అది జీవితానికి సంబంధించినది అనే స్పృహతో దానిని మనకందించడం లేదు అందువలన జీవితానికి అధ్యాత్మిక అనుభవానికి ఒక సాన్నిధ్యమున్నదనే అంశం కనిపించడం లేదు

కృష్ణమోహనరావు గారు జాతిని Educate చేయడానికి శ్రీవాణిని చేపట్టారు ఇది అవసరం ఎక్కడ Educate చేయడానికి వీలుంది ఈ నాలుగు రంగాలలో ఉన్న వికాసాన్ని ఎక్కడ వదిలి పెట్టాలి ఇది చాలా గొప్ప ప్రశ్న అయితే నేడు చదివిన చదువుకు చేస్తున్న కార్యక్రమానికి సంబంధం లేకుండా పోతున్నది జ్ఞానానికి జ్ఞానమే ఆచరణకు ఆచరణమే ప్రవర్తన ప్రవర్తనయే ఎప్పుడు జ్ఞానము హిమవత్ శిఖరము మీద వున్న మంచులా కరిగి గంగలా నీ జీవితంలో ప్రవహించదో గడ్డ కట్టుకున్న నీ మెదడు గడ్డతింటున్న నీ మనస్సు ఈ రెండూ వేరైపోతున్నాయి నీ చదువు నీ జీవితంలో ప్రవహించడం లేదు ఇదే మన Education లో వున్న గొప్ప Crisis బహుశా Knowledge అవగాహన చేసుకున్నట్లయితే Knowledge ని నీ జీవితంలో గనుక ఎంచుకొనడానికి ప్రయత్నం చేసినట్లయితే నీ Education లో ఇటువంటి Crisis వుండేటటువంటిది కాదు

రాధాకృష్ణ పండితులన్నమాట " Character is Destiny Character is that on which the destiny of Nation is built One cannot have the Great Nation without men and women of small character If You want to bulild a Great Nation we must try to train a large number of young men and women who have Character ఈ Character గా పరిణమించని Education నేటి స్థితి చాలామంది మేధావులున్నారు ప్రపంచంలో వైజ్ఞానికమైన నాయకత్వాన్ని నిర్వహించ గలిగే నటువంటి వ్యక్తులున్నారు కాని వారి శీలమున్నదని చెప్పలేం ఈ శీలము వైయుక్తికమైన శీలమే కాదు జాతి శీలము కూడా వారికున్నట్లు చెప్పలేం ఈ జాతి శీలాన్ని నిర్మింపజేసేటటువంటి Education కూడా నేడులేదు ఒక ఉదాహరణ M A లో చేర్చుకోవడానికి ఎల్లప్పుడు Interview చేస్తాం వారిని ఒక పద్యం చదవమని అడుగుతాం గత సంవత్సరం ఆ ఇంటర్‌వ్యూలో నేనూ ఉన్నాను ఇంటర్‌వ్యూకు హాజరైన ముప్పయి

మందీ ఒక పద్యం చదివారు "ఉప్పుకప్పురంబు పురుషులందు పుణ్యపురుషులు వేరయా అనే పద్యం చదివారు పుణ్యపురుషులు అంటే అర్థం ఏమిటి? అని అడిగాను ఎవరూ సరైన సమాధానం చెప్పలేక పోయారు చాలామందికి అర్థం తెలియక పోవచ్చు చాలా మంది టీచర్లు దీనికి మరొక అర్థం కూడా చెప్పవుండ వచ్చు పుణ్యపురుషులు అను Concept ను అర్థం చేసుకోగల జాతి ఇది ఒకటే బహుశా రాముణ్ణి కృష్ణుణ్ణి అవగాహన చేసుకో గలిగిన జాతి మాత్రమే పుణ్య పురుషులకు సరైన నిర్వచనం చెప్పగలదు అట్టి రాముణ్ణి కృష్ణుణ్ణి అర్థం చేసుకుని ఆత్మానందాన్ని ఎవరు పొందగలిగారో, అట్టి ఆత్మానందాన్ని అందింప గలిగటు వంటి దివ్య పురుషుణ్ణి పుణ్యపురుషుడు అంటారని మనం విద్యార్థులకు చెప్పవలసి వున్నది

ఈమధ్య యం ఎ ఇంటర్వ్యూస్‌లో కవిత్రయమంటే ఎవరు? వాళ్ళనుగురించి కొంచం వివరించమని అడిగారు మేము ఈ రకమైన పద్ధతిలో తయారు కాలేదన్నారు Objective పద్ధతిలో అయితే సమాధానం గుర్తుపెడుతామన్నారు బహుశా Objective type మరియు Specialisation ఎక్కువవుతున్నటువంటి ఈ తరుణంలో ఇది చాలా విపరీతాన్నియిస్తున్నది Comprehensive Personality అనే Concept పోతున్నది సాహిత్యాన్ని గురించి సమగ్ర అవగాహన జీవితాన్ని గురించి సమగ్ర అవగాహన లోపిస్తున్నది ఎందుకు పోతున్నదంటే నీ సంస్కృతిని గురించి నీవు చెప్పడంలేదు గనుక సంస్కృతిని గురించి ఎప్పుడు చెప్పడం జరుగుతుందో అప్పుడు సమగ్ర వికాసం కలుగుతుంది నీ సాహిత్యం నీజీవితంలో ఒక భాగం నీ విజ్ఞానం నీ జీవితంలో ఒక భాగం నీ రాజకీయం నీ జీవితంలో ఒక భాగం వీటన్నింటితో పాటు తర తరాలుగా వస్తున్న నీ విజ్ఞానం ఉంది నీ ఆత్మ అనుభవం ఉంది నీ ఆత్మానుభవంతో కూడుకున్నటువంటి విజ్ఞానంతో మొత్తం సమన్వయించక పోతే జాతీయ దృక్పధమే లేకుండా పోతుంది ఈనాడు మనలో చాలా మందిలో మన శాస్త్రముల మీదనే నమ్మకం లేకుండా పోతున్నది మన పురాణాలను గురించి ఏమాత్రం అవగాహన కూడా లేకుండా పోతున్నది ఇది మిక్కిలి దుర దృష్టకరమైన పరిస్థితి

ఈనాడు విదేశీయులు మన శాస్త్రాలను పురాణాలను అధ్యయనం చేసి శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి ప్రయోగాలను జరిపి ఎన్నో అమూల్యమైన విషయాలను కనుగొంటున్నారు ఈనాడు విదేశీయులు వ్యాసుడు రచించిన భాగవతం చదువుతున్నారు హిరణ్యకశ్యపుని భార్య గర్భంలో ప్రహ్లాదుడు పిండ రూపంలో వున్నప్పుడు నారదుడు ఆయనకు భక్తిని ప్రబోధించగా ఆ భక్తిని బోధించిన అంశం తరువాత అతను పుట్టి పెరిగినప్పుడు అతనిలో సంస్కార రూపంగా వచ్చిందని చదివి గర్భస్థ శిశువుకు సహితం మంచి వాతావరణమును సృష్టించుతే ఒక సంస్కారం కలుగుతుంది అన్నది తెలుసుకొని నేడు గర్భిణీస్త్రీలమీద ఎన్నో ప్రయోగాలు చేస్తున్నారు మన పురాణాలను విశ్వసిస్తున్నారు మన పురాణాలలో ప్రవచనది యదార్థాలేనని శాస్త్రీయ దృక్పథంతో ప్రయోగాలు జరిపి నమ్ముతున్నారు అనేక ఫ్యాక్టరిలలో గర్భిణీ స్త్రీలకు మధ్యాహ్న సమయంలో ప్రశాంతమైన వాతావరణంలో విశ్రాంతిని కలుగజేస్తున్నారు అంతేకాదు భారతదేశమునుండి భక్తి గీతాల క్యాసెట్సును తీసుకొని వెళ్ళి గర్భిణీస్త్రీలకు వినిపిస్తున్నారు రాబోయే తరంలో సాంస్కృతి ప్రవృత్తి తగుతుందేమోనని గర్భిణీస్త్రీల మీద అనేక ప్రయోగాలు చేస్తున్నారు పాశ్చాత్యులు ఈనాడు మన శాస్త్రాలను పురాణాలను చదివి పరిశోధించి ప్రయోగాలను జరిపి అనేక విషయాలను కనుగొంటున్నారు అన్నిటికన్నా మించినది ఆత్మ చైతన్యమున్నదని ఈనాడు వారు గుర్తిస్తున్నారు వీటిని గురించి యింకా విపులంగా ఆధునికంగా శాస్త్రీయంగా ఎవరైనా చెప్పేవారున్నారాయని భారతదేశం వైపు చూస్తున్నారు అయితే మనం మాత్రం మన జాతి పరంపరను ఔన్నత్యాన్ని విస్మరించి ఇతర దేశాలవైపు పరుగిడు

తున్నాం అనుకరణ వ్యామోహంలోపడి మన మహోజ్వల చరిత్రను తెలుసుకొనకుండా, మహాఋషులు అందించిన విజ్ఞానాన్ని పరిశీలించి అవగాహన చేసుకొనకుండా మనకంటూ ఏమీ లేదని భావిస్తూ అంధకారంలో పయనిస్తున్నాం ఇది అత్యంత విచారకరం

నేటి ప్రపంచం తమ దేశాల నుండి వ్యక్తం చేస్తున్న సిద్ధాంతాలనన్నింటిని భారతదేశం ఎలా స్పందించి మనకు తమ దృక్పథంతో వ్యాఖ్యానం చెబుతుందో వినాలని ఆసక్తితో వుంది ఇది మనమందరం గమనించవలసిన విషయం భారతదేశంలో సమాజం గనుక ఈ సిద్ధాంతాన్ని అంగీకరించినట్లయితే దానికి ప్రామాణికత్వం వస్తుందనే టటువంటి భావంతో పాశ్చాత్యలోకాలు ఈనాడు భావిస్తున్నాయి ఈ తరుణంలో మన జాతిని మనం సాంస్కృతికంగా వినిర్మించుకోవలసిన ఆగత్యం వున్నదీ అని శ్రీవాణి పత్రిక గుర్తించి తన ఉనికిని తన ప్రయత్నాన్ని సార్ధకం చేసుకుంటున్నందుకు ఈ పత్రికను నేను అభినందిస్తున్నాను ఈ పత్రిక నిర్వహిస్తున్న వైఖరిలో ఎంతో సంతోషించవలసిన విషయాలున్నాయి సాంస్కృతిక విప్లవం ఎప్పుడూ ఒక రాత్రిలో మనం తీసుకొని రాలేం ప్రజలు ఇంద్రియ వ్యామోహాలను ప్రేరేపించే పత్రికలను చదివినట్లుగా తదితర పత్రికలను చదవటం లేదు ఇలా చదవక పోవడానికి గల కారణమేమిటంటే తల్లిదండ్రులు తమ పిల్లలకు సరైన వాఖ్యానం యివ్వలేక పోవడం ఎందుకు వ్యాఖ్యానం యివ్వలేకపోతున్నామంటే మన అనుభవానికి మన చర్యకు మధ్య అంతరం ఏర్పడటం మన బలహీనతలను శాస్త్రీయమైన వ్యాఖ్యానములతో సమర్థించుకుంటున్నాం ఇప్పుడు యువతరం ప్రశ్నిస్తున్నది ప్రశ్నిస్తున్నదానికి సమాధానాలు మన దగ్గర లేకపోవడంచేత Cultural gap వచ్చింది ప్రశ్నలకు సమాధానం వున్నప్పుడే Cultural Revolution వస్తుంది ఈ తరానికి మనం ప్రశ్నలకు సమాధానం చెప్పడం మానేస్తే ఆ తరం ప్రశ్నలతో జీవిస్తుంది 0 సంవత్సరాలు Cultural Revolution ను ఆలస్యం చేసినవాళ్ళమవుతాం మనం చేస్తున్న పనులకు సమాధానం చెప్పే బాధ్యతను మనం స్వీకరించాలి నేటి పిల్లలు శాస్త్రీయ విజ్ఞానాన్ని పెంచుకుంటున్నారు మనం సమాధానం చెప్పలేని స్థితిలో వున్నాం ఆనూచారంగా పెద్దలు చెప్పిన సమాధానాలను మాత్రమే చెప్పి నచ్చచెప్పడానికి మనం ప్రయత్నిస్తున్నాం విమర్శనా దృష్టితో శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించక పోవడం వలన మనం పిల్లలకు నచ్చే విధంగా సమాధానాలు చెప్పలేకపోతున్నాం వారు మన సమాధానాలతో తృప్తిపడటం లేదు పిల్లలకు సమాధానాలు చెప్పవలసిన బాధ్యత పెద్దలమీద కూడా వున్నది అంతేకాదు సాంస్కృతిక పత్రికలమీద కూడా ఉన్నది మనం పురాణాలను వింటున్నాము గాని పురాణాల గాథల వెనుక వున్న పరమ రహస్యాన్ని మాత్రం ఆకళింపు చేసుకోలేకపోతున్నాం ప్రతి గాధ వెను కథవెనుక ఎంతో Reason వున్నది దానిని అవగాహన చేసుకొనకుండా కథలాగే వింటున్నాం చెబుతున్నాం అది సరిపోదు ఈ రోజున పాశ్చాత్య దేశాలలో మన పురాణాల మీద ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి విజ్ఞన దృష్టితో పరిశీలిస్తున్నారు పరిశోధిస్తున్నారు అయితే మనం మాత్రం ఆ విధంగా ఆలోచించడం మానివేసి కథలుగా గాధలుగా మనం చదువుకుంటున్నాం, తృప్తిపడుతున్నాం ఆధ్యాత్మిక చింతనలో లౌకికమైన ఇంద్రియానుభవాన్ని మానసికానుభవాన్ని వైజ్ఞానికానుభవాన్ని మిళితం చేసుకోగలిగిన ఒక సంస్కృతిని మనం ఏనాడో సృష్టించివున్నాం దీనిని మనం యిప్పుడు వ్యక్తీకరించలేకపోతున్నాం సాంస్కృతికమైన పత్రికలద్వారా ఇటువంటి అంశాన్ని నిరూపించాలి

శ్రీవాణి పత్రిక ఇటువంటి ప్రయత్నాన్ని ఈ రెండు సంవత్సరాలలో చేసినట్లు కొంతవరకు అవగత మవుతున్నది నేను శ్రీవాణి ఎడిటర్ గారికి ఒక చిన్న సూచనను చేయదలిచాను సాంస్కృతిక పత్రికగా

( తరువాయి 29వ పేజీలో )

# అవిసి మొక్క — యస్ యన్ దుర్గారావు

ఇవి సాధారణముగా చెఱకు తమలపాకు తోటలలో విస్తారముగా పెరుగును పువ్వుల రంగుల భేదముతో ఇవి 4 జాతులు కలవు అవి తెలుపు ఎరుపు నలుపు పసుపు పువ్వు వంకరగా నుండును కాయలు సన్నగా పొడవుగా నుండును ఎడారి మొక్కయగు సరికె పూత ఆరంభమగును




తీపి రుచి గలది త్రిదోషహారి శీత ఉష్ణ వీర్యములు గలది ఆకులు కారము కొంచెం చేదుగానూ ఉండును కొన్ని ప్రాంతాలలో దీని ఆకును కూరగా వండుకుని తినెదరు ఈ ఆకు కూర విపరీతమైన వేడి చెయుట వలన అవిసె కూర తినిన వాడు అరచి అరచి చచ్చును అను చమత్కార లోకోక్తి వాడుకలోకి వచ్చింది

దీని ఆకుకూర సేవించినందున కడుపులోని నులి పురుగులు హరించును పురికొన సాలె పురుగు మొదలగు క్షుద్ర విష జంతువుల విషము హరించును దీని లేత కాయలను కూడా కూరకు వాడెదరు ముదిరిన కాయలు పైత్యము చేయును గవద బిళ్ళలకు దీని ఆకు రసము పూసిన కరుగును

అవిసె ఆకును మిరియాలు ముద్దగా నూరి 4 లేక 5 చుక్కలు ఎండి పీల్చిన అపస్మారము తొలగును ఆకురసము మిరియాలు 15 చుక్కలు లోనికిచ్చినను 2 చుక్కలు నస్యము చేయించినను బాల పాప చిన్నెలు కుదురును తెలివివచ్చును

అవిసె ఆకు మెత్తగా కొట్టి కుండలో వేసి ఉడకబెట్టి రసము ఎండు ఆ రసము తులమెత్తు లోనికి పుచ్చుకొనిన రేజికటి హరించును ఆకు రసము 6 చుక్కలు నశ్యము చేయించిన వరుస జ్వరములు మానును ఈ విధముగా మూడు రోజులు చేయవలెను గింజల కషాయము మూత్రమును విడగొట్టును శిగ రోగములలో మూత్రము బంధమైనపుడు దీనిని వాడెదరు గింజలు ముద్దనూరి పట్టు వేసిన నడుము వాపు నొప్పులు ఉపశమించును దీని వెరు గంధము వాపులకు పట్టువేసిన తగ్గును వేరును తేనెతో అరగదీసి కంటికి కాటుక పెట్టిన కొయ్య గండలు పువ్వులు కరిగిపోవును పువ్వులు లేదా మొగ్గల కూరను 21 రోజులు తినిపించిన యెడల రేజీకటి నివారణ యగును

## సమాజం

ఈ అడవిలో వేసిన అడుగు
తడిసింది నెత్తుటిలో
ఆకాశంలోకి చాచిన చేతుల్లో
నక్షత్రాలు రాల్చాయి కన్నీళ్ళు,
పేదవాడి గుండెలో రేగిన మంటను
ఆర్పేసినాయి పారానీళ్ళు,
కళ్ళు చీకటిని ఎంత తవ్వినా
కనబడటంలేదు వెలుగు పొర

కాళ్ళు తెగిన ధర్మం
కళ్ళు పోయిన న్యాయం
పళ్ళు ఊడిన నీతి
ఇదీ నేటి సమాజం !

— యు శివలింగం

బంగాళాఖాతంలో వాయుగుండం ఫలితంగా నగరమంతా ముసురు వ్యాపించింది.

ఎవ్వరూ ఎక్కడికీ పోలేని పరిస్థితి

రోడ్లన్నీ జలమయమైనాయి

చంద్రయ్య వెదురు బుట్టలూ బద్దలూ తడిసిపోయాయి ఇంట్లోకి ఏ క్షణాన్నైనా మూసీనది నీరు రావచ్చు మూసీ కూడా నగరంపై పగబట్టినట్లు ఉధృతంగా పడగవిప్పి పారుతున్నది

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

నారాయణగూడా బ్రిడ్జి కింద వున్న అరటిచెట్లు సమూలంగా నిర్మూలింపబడ్డాయి

లింగంపల్లి వాల్ వద్ద బ్రిడ్జిని తన్నుకొని పారుతున్నది కోరంటీ దవాఖానా వెనుక వైపు కొంత భూమి కోసుకుపోయి అక్కడ ఒక ద్వీపం తయారైంది

చుట్టూ నాలుగు వైపులా జల ప్రవాహం

మధ్యలో కొన్ని గుడిసెలు

తాళ్ళు వేసి వాళ్ళను ఒడ్డుకు చేరుస్తున్నారు

చంద్రయ్య భార్య సమ్మక్క మనస్సు ఏమీ బాగా లేదు లోగడ ఒకసారి ఇలాంటి ముసురే వచ్చింది

అప్పుడూ ముసురులాంటి ప్రమాదమే వచ్చింది

ముసురై వచ్చిన ప్రమాదం

అప్పుడు యాదయ్య ఏడాదిలోపు పిల్లడు

ఉన్నట్టుండి జ్వరమూ దగ్గూ ముంచుకొచ్చింది బయట వర్షం లోపల వర్షం చుట్టూ నీళ్ళు కాని యాదయ్య శరీరమంతా సెగలూ పొగలూ వెదజల్లుతున్నది చంద్రయ్య సమ్మక్కల గుండెలలాగే

సమ్మక్క సారక్క అక్కా చెల్లెళ్ళు

మేడారం వరంగల్ జిల్లాలోని ప్రముఖ జానపద యాత్రాస్థలం అక్కడి జాతర్లకు లక్షల సంఖ్యలో తెలంగాణా మొత్తంమీదినుంచి తైర్గికులు వచ్చి కానుకలు సమర్పించి పోతూ వుంటారు మేడారం యాత్రవల్లనే తనకు సంతతి కలిగిందని పుల్లమ్మ విశ్వాసం అందుకే బిడ్డలకు సమ్మక్క సారక్క అని పేర్లు పెట్టుకొంది సమ్మక్కను చంద్రయ్యకిచ్చి చేసింది సారిని వరంగల్‌కు సమీపంలోని వడ్డెపల్లిలో ముత్తయ్య అనే వాడికిచ్చి పెళ్ళి చేసింది ఆ తర్వాత పుల్లమ్మ నిశ్చింతగా చనిపోయింది కాని దురదృష్టవశాత్తు ముత్తడు కాజీపేట స్టేషనువద్ద ఒక ప్రమాదంలో రెండు సంవత్సరాల క్రితం కాలం

చేశాడు అప్పటినుంచి సారి సంసారం ఛిన్నాభిన్నమైంది కూరలమ్ముకొని కూలి చేసుకొని ఎలాగో హనుమకొండలో జీవితం సాగిస్తున్నది అలాంటిది హఠాత్తుగా సారి తన అక్కగారింటికి వచ్చింది సారి రావడం వర్షం పట్టుకోవడం రెండూ ఒకదాన్ని ఒకటి అనుసరించుకొని వచ్చాయి

చంద్రయ్య గువ్వ ఎట్టలాఒక మూల కూర్చున్నాడు ఆయన చంకలో చిన్నోడు దూరాడు

చిన్నోడికి వర్షం వింత

ఉరుములు వింత

మెరుపులూ - మబ్బులూ చిత్రాతి చిత్రం

చిన్నోడికి మాటలు వచ్చు ఈ నీళ్ళన్నీ ఎక్కడివి

' దేవుడు పంపించాడు "

ఎన్నవ్వను కూడా దేవుడే పంపించాడా ? "

నిజమే ! సారిని కూడా దేవుడే పంపించాడు

వర్షంలో కరువులో బంధువులు వచ్చారని దిగులు లేదు చంద్రయ్యకు

చంద్రయ్య చిద్విలాస పురుషుడు

చంద్రయ్య సాక్షీభూతుడు

చంద్రయ్య ఒక కర్మ యోగి-

సాయంత్రానికి వర్షం కొంచెం తగ్గింది కాని ముసురు పూర్తిగా విడవలేదు సమ్మ చంద్రయ్య దగ్గరికి వచ్చింది

' ఏమే పిల్లలు మండటం లేదా '

" మండిసయ్ గంజ కాచి పోసినా "

మరేమి "

చెప్పవేం "

' ఏం లేదు సారికి ప్రాణం బాగాలేదు దవాఖానాకు తోలుకుపోవాలి "

( జరిగిన కథ )

డా మకరంద్ మాటలలో ఆవేశం రాణిని కలవర పెట్టింది అతను తన తండ్రిని ఉద్దేశించి అన్నాడా లేక యధాలాపంగా అన్నాడా అన్న అనుమానం రాణికి కలిగింది డా మకరంద్ జీవితం అంతా కష్టాల మయం ప్రారంభం నుంచి పేదవారంటే ఆప్యాయత పేద ధనిక భావాలమీద విరక్తి, ఇవన్నీ కలబోసి పేదల పెన్నిధిగా డా మకరంద్‌ని రూపు దిద్దాయి రవి విషయం గురించి రాణిని డా మకరంద్ అడిగాడు అతన్ని తన స్నేహితుడి చెల్లెల్ని అవమానించినందుకు తన్నులు తిన్నాడని, అతని స్వభావం మంచిది కాదని చెప్పడంతో రాణి కనీసం మర్యాదకన్నా అతనితో చెప్పకుండా ఇంటికి వెళ్లింది తండ్రి ఎక్కడ్నుంచి వస్తున్నావని అడిగిన దానికి డా మకరంద్ దగ్గర్నుంచి అన్న సమాధానానికి డా రాజు శ్యాం అయ్యంగార్ విస్తుపోయ్యారు

( ఇక చదవండి )

కోరంటే ఇప్పుడుండదుకదే !

' వద్దు రాజుబాబుగారి నాడికే పోతాము "

డాక్టర్ రాజు పేరంటే చంద్రయ్యకు భయం

సమ్మక్కకూ భయమే

సమ్మకు భయం కంటే అసహ్యం ఎక్కువ

లోగడ ఒకసారి చిన్నోడికి ప్రాణాంతకమైన జబ్బు చేసింది అప్పుడూ ఇలాంటి ముసురే

చంద్రయ్య బిడ్డను చేతులమీద వేసుకొని రాజువద్దకు తీసుకెళ్ళాడు అప్పటికింకా మకరంద్ హైదరాబాదు

రాలేదు  బరకత్‌పురాలో ప్రాక్టీసు పెట్టలేదు

శ్యాం అయ్యంగార్ బిడ్డను పరీక్షించాడు

చంద్రయ్య తనగూర్చి తాను ఎంతో ఆత్మీయంగా పరిచయం చేసుకున్నాడు  నేను బాబూ చంద్రిగాణ్ణి లతమ్మగారింటికి కాపలా కాస్తాను — యిద్దెల్లుతూ వుంటాను ''

శ్యాం చంద్రయ్యను కొన్ని వేలసార్లు చూచి వుంటాడు చంద్రయ్య కూడా కొన్ని వేల సార్లు నమస్కారం పెట్టి వుంటాడు

ఎన్నిసార్లు ఉదయమూ సాయంత్రమూ శ్యాం రాజు గారింటికి వస్తే అన్నిసార్లూ చంద్రయ్య ముందనుండీ పోవలసిందే చంద్రయ్య నమస్కరించవలసిందే శ్యాం స్కూటర్ రేపిన బురదా ధూళి చంద్రయ్య వెదురు బద్దల మీదా ఒకటి రెండు బిందువులు చంద్రయ్య మీదా పడవలసిందే !

అయినా సరే శ్యాం చంద్రిగాణ్ణి ఎవరో తెలియనివాణ్ణి చూచినట్లు చూచాడు

ప్రశ్నార్థకంగా పలకరించాడు

ముభావంగా మాట్లాడాడు

'ఎల్లిగాడికి ప్రమాదంగా వుంది  జరీ నారాయణగూడా పోయి సూదులు తెచ్చుకో '

సూదులకు పైసలు లెవు

అందుకని సమ్మక్క అంది ' నారాయణగూడాలో మందుల షాపులు ఎండ్ అయినాయి బాబూ

శ్యాం ఆలస్యం కాకుండానే సమాధానం ఇచ్చాడు

'' సరే ఓ యాభై రూపాయలిట్ల ఇయ్యి  నేనే సూదులు తెస్తా

యాభై రూపాయలు !

చంద్రయ్యకు బుట్టలమీద ఒక నెల సంపాదన — తాను లత ఇంట్లో అడ్డమైన నౌకరి చేసినా కూడా మూడు నెలలకు కాని రానంత డబ్బు ! !

''  బానిసను దొరా నీ కాళ్ళకు మొక్కుతా — చంటోడికి ముందు మందేదో ఇవ్వండి  పైసలు రేపు సర్దుతాను '

శ్యాం చాలా తమాషాగా నవ్వాడు

ఎంతో విచిత్రమైన నవ్వు

ఆధునిక సంస్కృతి తుంపురులు తుంపురులై రాలుతున్న నవ్వు

'' మూర్ఖుడా ! నీ బిడడి ప్రాణానికి  ముష్టి ప్రాణానికి యాభై రూపాయల మందులు వృధాచేయమంటావా '
అన్న భాష్యం ఆ నవ్వుకు చెప్పవచ్చు

' రేపు నువ్విచ్చేదేదో నాకు తెలుసు  వెదురు బొంగులు — పోయి పైసలు తీసుకురా  ఇంత క్లిష్ట పరిస్థితిలోనే డబ్బు రాల్చని వాడివి రేపు తాపీగా డబ్బు తెస్తావని చస్తే నేను నమ్మను  అన్న భావం కూడా అందులో వుండవచ్చు

' డబ్బుతెని  నీకు జబ్బు నయం చేసుకోవాలనే కోరికే అర్ధరహితం ' అని కూడా దాని అంతరార్థం కావచ్చు

తల్లి ప్రాణం తపించి పోయింది

ఎల్లవాడు గుడ్లు తేలవే యున్నాడు

సమ్మక్క శ్యాం రెండు కాళ్ళ మీదా పడింది

మంగళసూత్రం ఖంగున నేలపై మ్రోగింది

'' నా బిడను నాకు దక్కించు  కూలి చేసుకొనైనా నీ ఋణం తీర్చుకుంటా  పుణ్యానికి (ఉచితంగా) మందివ్వద్దు దొరా

శ్యాం మనస్సు ఇలాంటి ఆర్తనాదాలకు చలించే స్థితిని ఎప్పుడో కోల్పోయింది

అది ఒక స్థాయిని చేరింది

అది కేవలం డబ్బులను ఎంచు ఒక యంత్రం

సగం తనకు  సగం బాసకు

ఎంత తెలివిగా ఎంత ఎక్కువ ఎండితే మనస్సుకు అంత సాఫల్యం  అంత పరమార్థం

( సశేషం )

శ్రీవాణి

# 6,200 సీట్లుగల థియేటర్

**మనకు తెలియని ప్రపంచం**

**మల్లాది వెంకటకృష్ణమూర్తి**

న్యూయార్కు నగరంలోని రేడియో సిటీ మ్యూజిక్ హాల్ ప్రపంచంలోని పెద్ద థియేటర్లలో ఒకటి దీంట్లో 6 200 సీట్లు వున్నాయి ఇందులోని ప్రదర్శనలను చూడటానికి చుట్టుప్రక్కల 150 మైళ్ళ దూరంలో వున్న వూళ్ళ నుంచి రోజూ ప్రేక్షకులు వస్తూ వుంటారు

ప్రతి సంవత్సరం 125 చిత్రాల లోంచి 10 నుంచి 14 చిత్రాలదాకా ఎన్నుకుని వాటిని 12 నెలలు ప్రదర్శిస్తారు ప్రేక్షకుల ఆదరణని బట్టి ఒకే చిత్రాన్ని 3 నుంచి 10 వారాల దాకా ప్రదర్శిస్తారు ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్ అనే చిత్రం మాత్రం 11 వారాలదాకా నడిచింది

ప్రతీ ప్రదర్శన ముందు ఆరు నిమిషాలు 36 మంది అందమయిన అమ్మాయిలు రాకెట్ అనే నృత్యం చేస్తారు 60 మంది రకరకాల వాయిద్యాలు వాయిస్తుంటే ఇది అద్భుతంగా వుంటుంది

గేటు కీపర్లు సీట్ నెంబర్లు చూపించే ఉద్యోగులు ప్రేక్షకులు ప్రదర్శన గురించి ఏమనుకుంటున్నారో విని ఆ ప్రకారం చిత్రం ఎన్ని వారాలు ప్రదర్శించాలో నిర్ణయించడానికి మేనేజ్‌మెంట్‌కి తోడ్పడతారు

6 200 సీట్లకి ఎప్పుడూ 10 వేల మంది క్యూలో వుంటారు క్రిస్మస్ సీజన్‌లో సూర్యోదయానికి ముందే ఫ్లాస్కులో కాఫీ శేండ్విచెస్ తెచ్చుకుని క్యూలో నిలుచుంటారు ఇతర వూళ్ళ నుంచి వచ్చినవాళ్ళు క్యూలో గర్భవతులయిన ఆడవాళ్ళు అంగ వైకల్యం గలవాళ్ళు మత గురువులు సైన్యంలో పని చేసేవాళ్ళంతే క్యూని చెదిరిపోకుండా చూసే వుద్యోగులు వాళ్ళకి టిక్కెట్లు విడిగా ముందే ఇచ్చే ఏర్పాటు చేస్తారు

ఆ థియేటర్ తెర 3 టన్నుల బరువు కలిగి వుండే బంగారు పూతపూసిన లోహంతో చేయబడింది 13 ఎలక్ట్రిక్ మోటార్ల సహాయంతో తెరని ఎత్తటం దించటం చేస్తారు

ఆ థియేటర్‌లో 25 000 దీపాలున్నాయి వీటిని ఆర్పి వెలిగించడానికి 4 000 బటన్లు వున్నాయి ఏ లైటు ఎప్పుడు వెలగాలో, ఏది ఎప్పుడు ఆరాలో ముందే నిర్ణయించి ఆ విధంగా సెట్ చేసి పెడతారు అవి యాంత్రికంగా ఆరి వెలుగుతాయి ఆ ప్రకారంగా

సంవత్సరానికి 80 లక్షలమంది వస్తారు ఆ థియేటర్‌కి అయినా నేల మీద కార్పెట్ ఎప్పుడూ కొత్తగా వుంటుంది రోజూ పరీక్షించి పాడయిన భాగంలో కొత్త ముక్కని కుడతారు ప్రతి నాలుగు సంవత్సరాలకి కార్పెట్‌ని మారుస్తారు

47 సంవత్సరాల క్రితం ప్రారంభింపబడ్డ ఆ థియేటర్ ఎలా వుందో ఇప్పటికీ అంత కొత్తగా వుంది

ప్రతి రాత్రి ఆఖరి ప్రదర్శన అయినాక వందమంది వేక్యూమ్ క్లీనర్స్ నేలని శుభ్రపరుస్తారు 2 700 ఏష్ ట్రేలు శుభ్రపరుస్తారు వందల కొద్దీ వాష్ బేసిన్‌లని తళతళ లాడేలా తోముతారు సీట్లకింద నుంచి ప్రతి రోజు 20 పౌండ్ల బరువుగల చూయింగ్ గమ్‌ని వెలికి తీస్తారు



# కుందుర్తి విశ్వనాథుల ముఖాముఖి

**కుందుర్తి, విశ్వనాథులు విభిన్న మార్గాలలో పయనించిన ప్రతిభావంతులు ఒకనాటి గురుశిష్యులు వాళ్ళిద్దరూ స్వర్గలోకంలో ఎదురైతే ? ముఖాముఖిగా మాట్లాడుకుంటే ?**

**ఆ ఊహకి అక్షరాకృతి ఇది**

* ఎవరా వచ్చేది విశ్వనాథవారిలా వుందే వారిలా ఏమిటి విశ్వనాథవారే నమస్కారం గురువుగారూ !

* ఎవరు ? ఆంజనేయులువా ? ఎందులకో దొంగ నమస్కారాలు ?

* అదేమిటి అలా అంటారు ? నావి దొంగ నమస్కారాలా ?

---

ద్వా నా శా

---

* అవును నీవి అచ్చముగా దొంగ నమస్కారములే నన్నేమని సంబోధించితివి గురువుగారని కదూ ! గురువనుచుందువు నమస్కారములను చేయుచుందువు మరల నా సాహిత్యమును నా అభిప్రాయములను దుమ్మెత్తి పోయుదువు పేరుకు మాత్రము గురువును ఇదంతయు పాశ్చాత్య సంస్కృతీ లక్షణమే !

* మీరు కూడా అలా అనటం బావుండలేదు మీపై నాకు గురుభావం వుండటం వేరు మీ సాహిత్యం మీ దృక్పథాలు నచ్చకపోవటం వేరు నచ్చకపోయినంత మాత్రాన మీమీద గౌరవభావం వుండకూడదా ? మీరు ప్రతిభావంతులే అయితే ఆ ప్రతిభ అంతా వక్రమార్గాన నడిచిందన్నదే మాబోంట్ల బాధ

* నచ్చుట నచ్చకపోవుట ఇవి ఒక వింత ప్రవృత్తులు ఎవడి పూర్వజన్మ సంస్కారమునుబట్టి వాడి నచ్చుట నచ్చకపోవుటలు వుండును అసలు నచ్చుట అనగా నేమి ? కూర నచ్చదు అందుము చీర నచ్చును అందుము అవన్నియు అస్థిరములు స్థిరమైన సాహిత్యములో నచ్చకపోవుట లెందుకుండవలెను ? వుండవలెను ఎల యన ఇది ఎదపకాలము కాబట్టి ఇప్పటివారివి ఎదప బుద్ధులు కాబట్టి

* అయ్యో ఇక్కడికి వచ్చినా మీ మాటలు మారలేదు

* అవును మారవు ఎల మారవలెను నేను ఊసరవెల్లిని కాను మారుటకు మీకు నచ్చనంత మాత్రమున నేను మారవలెనా ? నేను మారనిచో నా ప్రతిభ వక్రమార్గమున పోయినట్లేనా ? మీకు నచ్చినది సవ్యము నచ్చనిది వక్రము మాకు నచ్చనిదియు వక్రమే యగును కదా !

* కావచ్చు కాని మీ అభిప్రాయాలకి కాలం చెల్లిపోయింది కాలాన్నిబట్టి సాహిత్యం మారాలి సాహిత్యం జీవనది అని మీరూ ఒప్పుకుంటారు కానీ ఆచరణలో మాత్రం అడ్డుకట్ట వేస్తారు సమాజ శోభనకి సాహిత్యం ఉపయోగపడాలి ప్రజల భాషలో ప్రజల దగ్గరకి సాహిత్యం వెళ్ళాలి లేనిపోని ఊహాపోహలతో ప్రజల్ని మభ్యపెట్టడం నేల విడచి సాము చెయ్యడం గర్హిస్తాం తిలక్ మిమ్మల్ని

> ' విశ్వనాథవారు వెనక్కి నడవగా నడవగా
> వేదకాలం యింకా వెనక్కి వెనక్కి పోయిందట "

అని బలేగా అన్నాడు ఎంత నిజం అది !

* అనుట కేమి ? గిట్టనప్పుడు ఎన్నైనను అనవచ్చును అనును కూడ అదే జీవిత రహస్యము

కాలము మారినదనియు మాది ప్రజా సాహిత్యమనియు ఏవేవో చెప్పుదురు మీ మోసపు మాటలు నమ్మి

అమాయకులు మీ వెంట వత్తురు ఆటువంటి వారిని చూచి మీరు ప్రజా బలమున్నదని ఎగిరిపడుదురు లోకపు రీతియే అంత ఒకడున్నాడు వాడికి పేరు రావలెను ఎట్లు వచ్చును ? తిట్టవలెను చాలు పేరు వచ్చును ఇది నేటి సంస్కృతి నా సాహిత్యము ప్రజలలోకి వెళ్ళలేదని మీ కెట్లు తెలియును ? ఓటింగు పెట్టిరా ? ఊరూరు తిరిగి అభిప్రాయమును సేకరించిరా ? లేదు కొందరు గుమికూడి అనుకుందురు ఆ అనుకున్న దానిని పత్రికలవారు వేయుదురు అదియే సత్యమైనదన్న వాదన నా దేశమున కొక సంప్రదాయమున్నది ఒక సంస్కృతి వున్నది అది అవిచ్ఛిన్నమైనది నా మార్గమును ఆమోదించువారనేకులున్నారు చివరకు నా సాహిత్యమే శాశ్వతముగా నుండును ఇ నిజము ఆంజనేయులూ నీ సంగతి చెప్పు నువ్వు పద్యాలు ఎంత చక్కగా చెప్పేవాడవు నీవును నా మార్గములో పయనించినచో పద్మభూషణ్ కళాప్రపూర్ణలే కాదు జ్ఞాన పీఠమును వచ్చి యుండును కాని శనిగాడు నీ నెత్తిమీదున్నాడు

* అయ్యా ! నా పట్ల సానుభూతి చూపక్కర్లేదు మీ సంప్రదాయాన్ని మీరు మూట కట్టుకొని భద్రంగా వుంచుకోండి చాలు కానీ ఒక్కమాట మీ రామాయణాన్ని చదివేవాళ్ళు చదివినా అర్థంచేసుకున్నవాళ్ళు ఎంతమంది వున్నారో మీరే ఓసారి పరకాయ ప్రవేశం చేసి తెలుసుకురండి మీకు పేరొచ్చింది నవలలు రాసినందుకు ఉపన్యాసాలు—విషయం ఎలా వున్నా— ఆకర్షించేవిగా వున్నందుకు మీ నోటికి దడిసినందుకు అందుకే నేను పద్మభూషణ్ కోసమో జ్ఞాన పీఠం కోసమో కవిత్వాన్ని రాయలేదు

" ప్రయోజనం తండ్రి
పరమ సౌందర్యం తల్లిగా
పలికే ప్రతివాక్కు రసానందకల్పవల్లిగా
నా దారి నాది '

ఆ దారిలోనే చివరిదాకా పయనించాను మీ గురించి లోకం ఏమనుకుంటోందో " నాలోని నాదాలు ' అన్న నా కవితా సంపుటిలో నిర్భయంగా చెప్పాను వినండి—

# నిత్య సత్యాలు

* " ఆశయాలు ఆదర్శాలు త్యాగాలు ఎంత ఉన్నతంగా ఉన్నప్పటికీ మహానుభావుల జీవితాలు అంత సామాన్యంగా ఉంటాయి "

* ' మిత్రుడు ఎల్ల ఎదైనా పొరపాటు జరుగుతే దానిగురించి నిర్మొహమాటంగా మాట్లాడాలి కాని అలా మాట్లాడేటప్పుడు అతని అంతర్యాన్ని నొప్పించడానికి ఏ మాత్రం ప్రయత్నించకూడదు '

* ' సత్య ధర్మాలను విడనాడకుండా ఓరిమితో వుండాలి క్షమాశీలుడు లోకాన్ని జయిస్తాడు వివేక శీలుడు సర్వాన్ని జయించ గలుగుతాడు "

* ఈర్ష్య అసూయ అనేవి ఏ ప్రయోజనమూ లేని పాపాలు వేరు పురుగులాంటివి వాటివల్ల ఎటువంటి వారికైనా పరాభవం తప్పదు ఆ దుర్గుణాలను దరికి చేరనీయరాదు "

* చేయవలసిన పని సక్రమంగా సకాలంలో చేయకపోతే ఫలితం ఆశించిన విధంగా వుండదు "

* సందర్భోచితమైన ధైర్యం సమయస్ఫూర్తి వివేకంతో కూడిన ఆలోచన ఉత్సాహశక్తి సాటిలేని సామర్థ్యం కార్య శూరత చాకచక్యం గలవారు ఏ రంగంలో నయినా సరే విజయాన్ని సాధించగలుగుతారు '

* ' విద్యుచ్ఛక్తి లాగే విజ్ఞానం కూడా ఒక రకం శక్తి దాని వెనుక వివేకం లేనప్పుడు మారణాయుధంగా పని చేస్తుంది "

---

మా గురువుగారి మాట
తిక్కపుడితే తిట్టిపోతాడు
కవినీ కావ్యవస్తువునూ
నిండు సభనీ నిర్వాహకుల్నీ "

## త్యాగం

పెరిగి పెరిగి
పూర్ణబింబమైనా
తరిగి తరిగి
అర్ధ బింబమైనా
రేరాజు వెన్నెల
వసుధ నలరించేందుకే
మహాత్ముల జీవితం
పదుగురినీ మేల్కొలిపేటందుకే

— శీతంరాజు ఉమాజ్యోతి

* ఆంజనేయులూ ! నువ్వన్నది కాదనలేను అయితే ఒక సవరణ " తిక్క " పదం మాత్రం అనౌచిత్యమే ఈ సభలూ కవులూ నిర్వాహకులూ అంతా మోసమే— అందరూ దొంగలే మేడిపండు సభలివి పైకి పొగడుదురు వెనకాల తిట్టుదురు ఇటువంటి రెండు నాల్కల ధోరణిని సహించలేను మిడిమిడి జ్ఞానమున్నవారిని దూషింప వలసినదే యోగ్యత లేనివారిని అందల మెక్కించినచో పూరకుండుట యెట్లు ? పూరకుండమనుకొనుము మరి సాహిత్య మేమయిపోవును నేను తిట్టినను కోపగించుకున్నను అది క్షణికమే—అంతే— " ఒకరిమీదఁ గోపమ్ము లేదొకరిమీదఁ బ్రేమలే దూరక చమత్కరించునుగవి " అన్నాను కదా ! పైగా మరో మాట అన్నాను చదువవు—వినుము—

" ఓసి కీర్తి ! నీకు నొక వేయి మ్రొక్కులు
లజ్జ విడిచినన్ గులంబు కొలఁది
వర భేద నిందఁ బె పెని రచనల
వచ్చు నీవు నాకు వలదు వలదు "

* అవునండీ, ఆ విషయంలో నేనూ ఏకీభవిస్తాను 'కిన్నెరసాని' పాటలు చూసి ఆధునిక మార్గానికి వస్తున్నారనుకున్నాను ఒక్కొక్కసారి వ్యావహారిక భాషనీ సమర్థించారు సమర్థించడమే కాదు మీ కవితల్లో చొప్పించారు కూడా మీవంటివారు మా మార్గాన్ని తొక్కివుంటే ఎంత బాగుండేది ?

* ఆంజనేయులూ ! నువ్వు తొక్కావు ఏం బాగు తిన్నావు ఆస్థానకవి పదవైనా వచ్చిందా ?

* నా స్థానం ఆస్థానం కాదు పాఠకుల గుండెల చెరసాలలో బందీగా వుండిపోయాను అది చాలు నాకు ఒక విధంగా షష్టిపూర్తి ఉత్సవం జరక్కముందే మరణించటం కూడా మంచిదే అయింది ప్రజా కవికి షష్టిపూర్తి ఉత్సవాలేమిటని తర్వాతి తరం ఆడిపోసుకునేది నేను వచన కవితని ఓ ఉద్యమంగా నడిపాను వ్యావహారిక భాషలోనే వచన కవితలు రాయాలనీ పటాటోపం పనికి రాదనీ అందని అలంకారాలు కూడవనీ కథా కావ్యాలు రావాలనీ తపన పడ్డాను—కృషి చేసాను

* నువ్వు కొంత నయం నీ సహచరులు ప్రజా కవిత్వం, అభ్యుదయ కవిత్వం అని ఉపన్యాస విన్యాసాలు చేసారూ ? వాళ్ళు పైకి చెప్పనది వకటి—కవితల్లో కనుఎంచునది వేరొకటి నీ అడుగు జాడలలో నీ సమకాలికులు పయనించారా ?

* కొంత నిజం లేకపోలేదు నా సహచరులు పూర్తిగా పూర్వపు పద్ధతుల్ని త్రెంచుకుని రాలేకపోతున్నారు గానీ యువకులలో చాలామంది నాకు అనుచరులే వాళ్ళమీదే నాకు కొండంత ఆశ వుంది

* ఇవ్వాళ్టికి చాలును పలకరించావు సంయమనంతో సంభాషించావు చాలును రంభ నృత్యము చూడవలెను నేను పోయెదను

* నమస్కారం

# జ్యోతిషవాణి

నిర్వహణ దైవజ్ఞరత్న వాస్తు జ్యోతిష విద్వాన్
**క వి తా కా మే శ్వ ర శ ర్మ**
అవనిగడ్డ 521 1'1

**బొల్లూరి సుధాకర్ నందిగామ**

సమా మీరు కూడా కూపనులో లేఖ వ్రాయు టైం వ్రాయలేదు అయినా నాకు మీ లేఖ చేరిన టైం బట్టి సంతానం కలుగుతుంది కొంచెం ఆలస్యం వంశోద్ధరణ కలుగును మీ గ్రామం ( నందిగామ ) లోని పండితులను సంప్రదించండి ఏమి చెప్పుతారో డాక్టర్లకు కూడా చూపించండి ఏది ఏమైనా నిరుత్సాహంకి తావులేదు శాస్త్ర ప్రక్రియలు లేకపోలేదు అవన్నీ ఇందులో వ్రాయుట భావ్యం కాదు

**యస. సదాశివం హైదరాబాదు 44**

తురీయోన్ముఖమైన మనస్సుగల యీ జాతకుడు సరస్వతీ యోగప్రాప్తి యింకను పొందకపోవుటను ఒక సాహిత్య వహపురస్కారము పొందినగాని ప్రారబ్ధము పూర్తి కాదని బుధ మహా దశా ద్వితీయ భాగమున గాని ఎద్దీ లేదని భావన ఉన్నది ఇది ఇట్లే అగునా?

సమా ఎంతటి చక్కని ( గొప్ప ) ప్రశ్న మీ భావన Corrcet మీకు సమాధాన ఇచ్చుట చాలా ఆలస్య మైనది క్షంతవ్యోమేఽపరాధమ్

**కె నాగకుమార్ ఎందరు**

మీరు 6 ప్రశ్నలడిగినారు కూపను జతపరచ లేదు మరియు టైము పగలు రాత్రి అను దానిని అర్థం చేసు కోలేదు మీరు పగలు అని టైంకు బదులు వ్రాశారు పగలో రాత్రో వ్రాస్తూ అప్పటి టైం వ్రాయాలి అంతేనే గాని పగలు రాత్రి యీ రెండింటిలో ఎప్పుడు అనికాదు

**వేమూరి కామేశ్వరరావు పెదనిండ్రకొలను**

సమా ఉద్యోగప్రయత్నం 1987 ఉత్తరార్థంలో ఫలించ వచ్చునని తోస్తోంది కోర్టువ్యవహారాలు విజయం లభిస్తుంది ప్రస్తుతం ఏలినాటి శని ధనూరాశిలోకి శని వస్తేనే గాని కొంత రిలీఫ్ రాదు శనికి శాంతిచేయిం చండి శనిస్తోత్రం పారాయణ చేయండి విష్ణు సహస్ర నామ స్తోత్రం పారాయణ మంచిది

**దేవతవెంనా ఉదయభాస్కర్ నందిగామ**

సమా ప్రశ్నపంచకం సంపారా : కాదు కాదు ప్రశ్నషట్కం డిగ్రీ ప్యాసవుతారు ప్రస్తుతం ఫరవా లేదు పరిస్థితి బాగానే వుంది మీరు 2nd Inter ప్యాస యినారు గదా భవిష్యత్ అని వ్రాయలేరా? భౌష్యత్ అని వ్రాస్తారేమిటి? ఆంధ్రులే గదా మీరు ఉద్యోగం చేస్తారు భవిష్యత్ బాగుంటుంది లాటరీ లాభించదు జనన కాలం లేనిదే కేవలం తేదీవలన రాశి ఏదగునో చెప్ప వీలుండదు ఎందుకంటే నక్షత్రం మారవచ్చు ఒక్కప్పుడు దాని వలన రాశి మారవచ్చును చూడండి జననతేదిని కూపనులో 10–9–86 అని వ్రాసినారేమిటి : లేఖ వ్రాయుతేది 13 9 86 అన్నారు మీ స్టూడియోలో మీరు శాకు చక్కని ఫోటో తీయించి పెట్టుతారా మీ వూరు వస్తే నందిగామలో మా మిత్రులున్నారు రావాలి వారు పండితులు చతుర్వేదుల రామలింగ శాస్త్రిగారు ప్రసిద్ధులే గదా మీ ప్రాంతంలో ★

## జ్యో తి ష వా ణి

పేరు

పూర్తి చిరునామా

లేఖ వ్రాయు తేది

టైము పగలు/రాత్రి

జనన తేది లేనిచో సుమారు వయస్సు

( వెరైటీ కథ )

# కమర్షియల్ రైటర్ ..................... జ్యోత్స్న

అర్ధరాత్రి.

చీకటిని చీల్చుకుంటూ గోదావరి ఎక్స్‌ప్రెస్ దూసుకుపోతోంది.

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోని ఒక కేబిన్‌లోని నాలుగు బెర్తుల్లో మూడు బెర్తుల మీది వ్యక్తులు నిశ్చింతగా నిద్రను కౌగలించుకుని పడుకున్నారు క్రిందనున్న నాలుగో బెర్తుమీది ఒక మధ్య వయస్కుడు మాత్రం నిద్రను కౌగలించుకోలేదు, ఒళ్ళో ఒక ఫైలుమీద కాసిన్ని కాగితాల్ని పెట్టుకుని కూర్చున్నాడు

చేతిలోని పెన్నుని బుగ్గమీద ఆనించి సుదీర్ఘంగా ఆలోచిస్తున్నాడు అప్పుడప్పుడూ ఎదురు బెర్తు మీద నిశ్చింతగా హాయిగా నిదురపోతున్న ఆ అందమైన అమ్మాయివైపు చూస్తున్నాడు

తప్పదు ! ఈ రాత్రికి ఎలాగైనా రాసి తీరాలి ! అని తనలో తాను పదేపదే అనుకుంటున్నాడు అతని మెదడులోని ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చాయి

అతను ఆ అర్ధరాత్రి ఆ రైలు పెట్టెలోనే రాయడం ప్రారంభించాడు

*

స్వప్న — హైదరాబాద్

ప్రశ్న  మొన్న ఉదయం నేను మీ యింటికి వచ్చాను గుర్తువున్నానా ?

జవాబు  మొన్న ఉదయం కాదు నిన్న రాత్రి వచ్చారు మీ ' పేరు లోకి మీరే గుర్తు తెచ్చుకోండి !

ఉష — గాంధీనగర్

ప్రశ్న – మీ రాతలు అస్సలు అర్థం కావు ఎవర్ని ఉద్ధరిద్దామని రాస్తున్నట్లో

జవాబు  " అర్థంకాకపోవడాన్ని "

గోపాలాచారి — విజయనగరం

ప్ర॥ రోజూ చింతించే వాళ్ళెవరో చెప్పుకోండి చూద్దాం ?

జ॥ రేడియోవాళ్ళు, టీ వి వాళ్లూ ( ప్రసారాల్లో అంతరాయం కలుగుతున్నప్పుడల్లా )

సందేహాల్రావ్ — దౌడ్పఘాట్

ప్ర॥ మీ సీరియల్ నవల పూర్తయేసరికి హీరో హీరోయిన్ల మధ్య ఊహించలేని గొప్ప మార్పొస్తుందని నా నమ్మకం మీరేమంటారు ?

జ॥ హీరో హీరోయిన్‌గాను హీరోయిన్ హీరోగానూ మాత్రం మారరని నా నమ్మకం

రజనీ శకుంతల — గుంటూరు

ప్ర॥ మీకా గడ్డం ఏం బాగాలేదు తీసేయకూడదూ ?

జ॥ అడ్డమొచ్చినవాళ్ళు చెప్తే అలాగే చేస్తాను

రవి — విజయవాడ

ప్ర॥ ఇంట్లో మగపిల్లలకు ఖర్చు కిచ్చేది పాకెట్ మనీ' మరి ఆడపిల్లలకు ఖర్చు కిచ్చేది ?

జ॥ మగపిల్లలకు పాకెట్లుంటాయి కాబట్టి పాకెట్ మనీ ఆడపిల్లలకు పాకెట్లు బదులుగా జాకెట్లుంటాయి కాబట్టి ఇకనుండీ జాకెట్ మనీ అనుకోండి

ఎచ్చిరెడ్డి — బుచ్చిరెడ్డిపాలెం

ప్ర॥ ఒక ఎలక్ట్రిక్ రైలు తూర్పు నుండి పడమరకు అరవై కిలోమీటర్ల వేగంతో పోతోంది పడమర నుండి తూర్పుకి అదే అరవై కిలోమీటర్ల వేగంతో ఎదురుగాలి వీస్తోంది రైలు ఇంజను పొగ ఎటువైపు వెళ్తుందో చెప్పుకోండి చూద్దాం ? (మీ నవలల్లో ఇటువంటి పజిల్స్ ఇస్తుంటారు గాబట్టి అడిగాను)

జ॥ ఈ ప్రశ్నకు జవాబు మీరు ఎక్కడ నిలబడి చూస్తున్నారన్న దానిమీద ఆధారపడి వుంటుంది మీరు రైలుకింద వుంటే పొగను చూసే అవకాశం వుండదు మీ బుర్రలో మెదడుంటే ఎలక్ట్రిక్ రైలింజన్‌కి పొగ రాదన్న విషయం ఈపాటికి తెలిసే వుంటుంది

మన్మధరావ్ — ప్రేమాపురం

ప్ర॥ నేనో అమ్మాయిని ప్రేమించాను ఆ అమ్మాయి ఇంకో అబ్బాయిని ప్రేమించింది అయితే ఆ అబ్బాయి ఈ అమ్మాయిని కాక యింకో అమ్మాయిని ప్రేమిస్తున్నాడు ఈ విషయం ఈ అమ్మాయికి ఎలా తెలియ జేయడం ? ప్లీజ్ ! సలహా యివ్వరూ ?

జ॥ 1859 లో మైకెల్స్ మెర్సన్ అనే ప్రొఫెసర్ ఇలాగె మేరీ మైలీ అనే తన విద్యార్థినిని ప్రేమించాడు అయితే మెరీ మైలీ రోమన్ రోజర్ అనే తన క్లాస్ మేట్‌ని ప్రేమించింది రొమన్‌రోజర్ మాత్రం ఎల్లీ అనే ఇంకో అమ్మాయిని ప్రేమించాడు ఈ విషయం మేరీ మైలీకి తెలీదు అయితే అన్ని విషయాలూ ప్రొఫెసర్‌కి మాత్రం తెలుసు అప్పుడు ప్రొఫెసర్ వయస్సు 50 సంవత్సరాలు వెంటనే అతను ఈ సమస్యను పరిష్కరించడానికి, అర్జంటుగా పాతిక సంవత్సరాల కుర్రాడిగా మారాలనుకున్నాడు జీవితాంతం

# నీతి మంజరి

శ్లో॥ మాతృ వత్పర దారాంశ్చ
పర ద్రవ్యాణి లోష్టవత్
ఆత్మ వత్సర్వ భూతాని
యః పశ్యతి సపశ్యతి

ప పర సతి తను తల్లి వరుసను దిలకించి
పర ధనముఁ దృణముగఁ బరిగణించి
సర్వజీవుల యెడ సమత వర్తిల్లిన
యతఁడె జ్ఞానవేత్తయందు రవని

శ్లో॥ భార్యా వియోగశ్చ జనాపవాదః
ఋణస్య శేషః కుజనస్య సేవా
దారిద్ర్య కాలే ప్రియదర్శనం చ
వినాగ్నినా పంచ దహంతి కాయమ్

ప నిజ సతి యెడబాటు నిందయు ఋణశేష
డగుట దుష్ప్రవర్తనాత్ముఁ గొలుపు
మిగుల లేమి వేళ మిత్రాగమంబును
నిప్పు లేక మేను నీఱు సేయు

శ్లో॥ ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం
మంత్రౌషధి సమాగమాః
దాన మానావ మానశ్చ
నవగోప్యాః మనీషిభిః

ప ఆయుషము ధనము గృహాంతర లోపముల్,
మంత్ర మౌషధమ్ము మదనకేళి
మాన్యమైన దాన మానావమానముల్
గోప్యముగనె యుంచుఁ గోవిదుండు

— పృథివి సుబ్బనాగయ్యకవి

## నేతాజీ

భరత ధరిత్రి
స్వాతంత్ర్య సమర
పవనాగ్ని కుండంలోంచి—
సంకల్ప వజ్ర కవచమూ
పౌరుషాభిమానాల ధనుర్బాణాలూ
త్యాగశీల చంద్రాయుధమూ
దీక్షాపరతంత్ర సువర్ణ కిరీటమూ
ధరించి, ఒగేలున కళ్లు మెరిపించి
దేశభక్తి దివ్యశ్వేతాశ్వారూఢుడై
జైహింద్ నినాద పతాకంతో
జన్మించిన ధృష్టద్యుమ్నుడు!
పేరు తలచుకుంటేనే
ఒడలు పులకరించే
జగదేక వీరుడు!
ప్రజల జ్ఞాపకాల పాత గోడలమీద
వ్రేలాడుతూ
మరపుల బూజు పడుతూన్న చిత్రంలోని
మహాశూరుడు!

—డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు

వరకూ వయస్సు తగ్గించే ప్రయత్నంలోనే పరిశోధన కొన సాగించాడు. అంచేత మీరూ

* * *

గోదావరి ఎక్స్‌ప్రెస్ స్టేషన్‌లో ఆగింది. అప్పటికి చీకటి తెరలు నెమ్మదిగా తొలుగుతూ, వెలుగు కిరణాలు విచ్చుకుంటున్నాయి. సూట్‌కేస్ సర్దుకుని రైలు దిగాడు ఆ మధ్య వయస్కుడు'

వెంటనే యింటికి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీస్‌కి పోవాలి. హైదరాబాద్‌లో వుంటూండగానే మరో ఎరియాని కవర్ చెయ్యాలని అర్జంటుగా ఆఫీస్ నుండి వచ్చిన ఫోన్‌కాల్ గుర్తు తెచ్చుకుని నడక వేగం పెంచాడు.

అతను ఓ పేరుగాంచిన మందుల కంపెనీలో మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తున్నాడు.

ఇంటికి చేరుకుని అవసరాలు తీర్చుకుని హడావిడిగా ఆఫీస్‌కి బయల్దేర బోతుంటే ఆ మధ్య వయస్కుని భార్య అంది. మెరుపు వారపత్రిక సంపాదకుడు మూడు సార్లు కబురు చేశాడండీ! ఈ వారం మీ సీరియల్లో ముఖాముఖి శీర్షికకు మీరింకా ప్రశ్నలూ జవాబులూ ఇవ్వలేదట. మీకొచ్చిన ఉత్తరాలన్నీ అవిగో మీ టేబిల్ మీద పెట్టాను' అంటూ వంటింటిలోనికి వెళ్ళ బోయింది.

'ఇవిగో అనూ! ఇవ్వాళ అబ్బాయిచేత ఈ ముఖా ముఖీ కాగితాలు పత్రికాఫీసుకి పంపేయ్! నేను ఆఫీసు నుండి అటే టూర్ వెళ్తున్నాను" అంటూ రాత్రి రైల్లో రాసిన కాయితాల్ని అందించాడు అతను.

ఆమె అతనివైపు ఆశ్చర్యంగా చూసింది.

"—అదేవిట డీ! మీకొచ్చిన వుత్తరాలు చదవ కుండానే జవాబులు ఎలా రాసేశారు?" అంటూ ఆశ్చర్యంగానే అడిగింది.

'నీకు తెలీదోయ్! కమర్షియల్ రైటర్ అన్నవాడు ఎక్కడైనా సరే ఎక్కడైనాసరే ఎప్పుడైనా సరే బార్బర్ షాపులో వున్నా బాత్‌రూంలో వున్నా చివరకు శోభనం గదిలో వున్నాసరే రాయగలిగే స్థితిలో వుండాలి' అంటూ ఆఫీస్‌కు నడిచాడు.

అతను ఆంధ్రదేశంలో పేరు మోసిన "కమర్షియల్ రైటర్."

అంటే ప్రశ్నలూ మీరే జవాబులూ మీరే రాశేశా రన్నమాట..." అతని భార్య అంటున్న మాటలు అతనికి వినబడుతున్నా వినపడనట్టే నటిస్తూ వెళ్ళిపోయాడు ★

# రంజనిమాల

సంకలనం డా॥ వి ఫణీంద్రుడు



ఈ పేర్లని వాల్లు జయంతి భారవి అంతర్వేది కేతరాజు కొండుభట్టు నాగావళ లీలావతి కుసనగర చంగీజు ఖాన్ భాస్కర కృష్ణ, లీలాశుకుడు శ్రీపాద రాయలు అడవి బాపిరాజు అనంత భూపాలుడు నీలం సంజీ రెడ్డి పావులూరి మల్లన్న రాచూరి తిమ్మరాజు రాయ రఘునాధుడు విరూపాక్ష రాయలు తిమ్మగజపతి రాజు తెనాలి రామకృష్ణుడు రాజా ఇమ్మడి అంకినీడు కట్టమంచి రామ లింగారెడ్డి జయతాపురం కేశవరావు అమర్చి రంజనిమాలని పూరించండి

## జనవరి రంజనిమాల సమాధానములు

అడ్డము 1 జాతహారిణి 5 గయుడు 6 హరి వాయువు 8 దుస్సల 9 ఎప్పలాదుడు 12 ప్రమీల 13 దేవసేన 15 కద్రువ 16 పతంజలి

నిలువు 1 జాతవేదుడు 2 హాలాహలం 3 లింగము 4 దండుడు 7 వాతాపి 10 దుస్సేనుడు 11 కాలకలి 13 దేవకి 14 చేప

# ప్రశ్నలు-సమాధానాలు

1 మన దేశంలో ఉన్న డైలీ పేపర్లు ఎన్ని ?

2 వ్యాధుల పరిశీలనకు ఉపయోగించే శాస్త్రం పేరేమిటి?

3 ఆధునిక పద్ధతిలో విశ్వ విద్యాలయం మొదట ఎప్పుడు ఎక్కడ ఏర్పడింది ?

4 జంతు ప్రదర్శనశాల (Zoo) మొట్టమొదట ఎప్పుడు ప్రారంభమైనది ?

5 మన దేశంలో ఉన్న వీక్లీ (వారపత్రిక)లు ఎన్ని?

6 మొట్ట మొదటి డిక్షనరీ ఏ భాషలో రాయబడింది?

7 ప్రపంచంలో కెల్లా చిన్నదైన వాటికన్ సిటీ ( దేశం ) యొక్క వైశాల్యమెంత ?

8 నౌకాదళంలోని ఎక్కువ హోదా పేరేమి ?

9 భారత ఉప రాష్ట్రపతి పదవీ కాల మెంత ?

10 మానవ శరీరంలో ఉన్న ఎముకలు ఎన్ని ?

11 నేషనల్ ఫిజికల్ లేబరేటరీ ఇండియాలో ఎక్కడ ఉన్నది ?

12 సామాన్య మానవుడు ఆహారం లేకుండా ఎన్నిరోజులుండగలడు ?

13 మొక్కలకు ప్రాణం ఉన్నదని కనిపెట్టిన శాస్త్రవేత్త ఎవరు ?

1 1334 2 నోసోలజీ 3 1231 లో ఇటలీలోని శాలెర్నోలో 4 క్రీ॥ పూ॥1150 లో 5 5893 6 లాటిన్ 7 17 చదరపుమైళ్ళు 8 అడ్మిరల్ ఆఫ్ ది ఫ్లీట్ 9 5 ఏళ్ళు 10 211 11 న్యూఢిల్లీలో 12 సుమారు వారం రోజులు 13 జగదీశ్ చంద్రబోస్ ఇండియాకు చెందినవాడు

కలికాలంలో అత్యంత ప్రధానమైనది భక్తి భక్తుడు నిరంతరానంద డోలికల నూగులాడుతూ ఉంటాడు తన సేవా ధర్మం నిర్వహించడానికి తన శరీరం ఒక ఉపకరణం మాత్రమే అని గ్రహిస్తాడు భక్తిని ఈ విధంగా ఆదిశంకరులు నిర్వచిస్తారు

" అంకోలం నిజబీజ సంతతి రయ
స్కాంతోపలో సూచికా
సాధ్వీ నైజ విభుం లతాక్షితిరుహం
సింధుస్సరి ద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతే
ప్పాదారవింద ద్వయం
చేతో వృత్తి రుపేత్య తిష్ఠతి సదా
సా భక్తి రిత్యుచ్యతే "

( శివానందలహరి శ్లో 61 )

## వసంతరావు వెంకటరావు

పండిపోయి చెట్లనుండి రాలిన ఊడుగు గింజలు తమంతట తామే చెట్లకు అతుకుకొని పోతాయి సూదంటు రాయి దగ్గరకు సూది పరుగెత్తికొని పోయి దానిని అంటుకొంటుంది పతివ్రత తన భర్తను ఎల్లప్పుడూ వెంబడించియే వుంటుంది తీగ తనంతట తాను చెట్టును పెనవైచుకొంటుంది నదులు పారిపారి సముద్రంలో కలిసిపోతాయి అదే విధంగా మానవ మనోవృత్తి శివుని చరణ కమలములందు జొచ్చి వుండుటే భక్తి అని పెద్దలు చెబుతారు

శ్రీ మద్భాగవతంలో ప్రధానంగా రెండు రకాల భక్తులు తటస్థపడతారు ప్రహ్లాదుడు, గజేంద్రుడు ప్రహ్లాదునిది నిర్మలమై, నిస్స్వార్థమై అకుంఠితమైన భక్తి స్వస్వరూపం తెలుసుకొన్న ప్రహ్లాదుడు, తను శరీరం కాదన్న బలమైన విశ్వాసంతో విష్ణు పాదారవిందాలకు చిత్తాన్ని అప్పగిస్తాడు అది తండ్రి హిరణ్యకశిపునకు నచ్చదు తన వైరియైన విష్ణువుని కొడుకు భజిస్తే కోపోద్రిక్తుడై విష్ణు స్మరణ మానమంటాడు ప్రహ్లాదుడు మానడు క్రోధ జ్వాలలు వెళ్ళగ్రక్కుతూ ప్రహ్లాదుని అనేక విధాల హింసిస్తాడు ఏనుగులచేత త్రొక్కిస్తాడు విషసర్పాలచే కరిపిస్తాడు కొండమీద నుండి క్రిందకి త్రోయిస్తాడు ఏం చేసినా ప్రహ్లాదుడు బాధపడడు బాధలు శరీరానికి కాని ఆత్మానుసంధానం చేసిన తనకు కాదనుకొన్నాడు దానితో హిరణ్యకశిపుని అహంకారం దెబ్బతింది ఒక బాలుడు తనను ధిక్కరించడమా ! శరీరం పొగలు గ్రక్కింది అయితే విష్ణువు ఎక్కడున్నాడు? అని గర్జిస్తాడు ప్రశాంతంగా ప్రహ్లాదుడిచ్చిన జవాబు

ఇందు గల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి ! వింటే !

అయితే హరిని ఈ స్తంభంలో చూప గలవా ? అని కనక మణిమయ హస్తంతో వ్రేటు వేయగా ఫెళఫెళ స్తంభం ముక్కలై దానిలో నుండి ఉగ్ర నరసింహావతారం ఆవిర్భవించి హిరణ్యకశిపుని చీల్చి చెండాడుతుంది భక్తుని రక్షించే బాధ్యత భగవంతునిది అదను చూచుకొని ప్రత్యక్షమై రక్షిస్తాడు ప్రహ్లాదుడు ప్రార్థించకుండనే ప్రత్యక్షమయేడు

గజేంద్రుని విషయం ఇటువంటిది కాదు వానిది ఆపద్భక్తి నీటికోసం సరస్సులో దిగిన గజేంద్రుని మొసలి పట్టుకొంటుంది విడిపించుకోడానికి గజేంద్రుని బలం చాలిందికాదు పరివారం కూడా సహాయం చేయలేక

# "శ్రీవాణి" జీవిత సభ్యులు





శ్రీ ప్రభల లక్ష్మీనారాయణశాస్త్రి
లలితా ట్రాక్టర్ స్పేర్స్
గవర్నరుపేట విజయవాడ 2

శ్రీ విడియాల వెంకటేశ్వరరావు
శ్రీ లక్ష్మీనారాయణ విలాస్ (స్వీట్ షాపు)
పట్టాభిమార్కెట్ మచిలీపట్నం

శ్రీ మాడుగుల జనార్ధనరావు
కొత్తపేట నూజివీడు
కృష్ణాజిల్లా

పోయింది ప్రాణ భీతితో హృదయం పరితపించింది ఆర్తి పెరిగింది భగవంతుడు తప్ప తనను రక్షించే వారెవ్వరు లేరన్న భావం బలీయంకాగా ఆర్తత్రాణ పరాయణుని బహు విధాల స్తుతిస్తాడు సహాయం రాదు దానితో భగవంతుడు నిజంగా ఉన్నాడా లేదా అనే సందేహంతో

"కలడందురు దీనుల యెడ
కలడందురు పరమ యోగి గణముల పాలన్
కలడందు రన్ని దిశలను,
కలడు కలండనెడు వాడు కలడో లేడో?"

అని వాపోతాడు ప్రహ్లాదుని కట్టి సందేహం లేదు మళ్ళీ విశ్వాసం కుదురుతుంది అప్పుడు

'నీవే తప్ప నితఃపరం బెరుగ మ
న్నింపన్ దగున్ దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సం
రక్షింపు భద్రాత్మకా!"

అని దీనారవంతో ఎలుగెత్తి ప్రార్థిస్తాడు

ఆ ఆర్తనాదం విష్ణుని చెవులకు సోకినంతనే

"సిరికిం జెప్పడు శంఖ చక్రయుగముం
జేదోయి సంధింప దే
పరివారంబును జీర దభ్రగ పతిన్
బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము జక్కనొత్తడు, వివా
ద ప్రోత్థిత శ్రీ కుచో
పరిచేలాంచనమైన వీడడు గజ
ప్రాణావనోత్సాహియై"

ఆర్తితో కుందుచున్న భక్తుని రక్షించడానికి అంత సంరంభంతో బయలుదేరుతాడు భక్తి ఎట్టిదైనా భక్తుల యోగక్షేమాలు తనే వహిస్తానంటూ భగవంతుని ఉద్ఘాటన

"అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం
వహామ్యహం'



# ఆడతనం చూపించే మగ ఫెలరోప్



ఆడతనంచూపించేమగపెలరోప్

సముద్ర తీరంలో జీవనం సాగించే పక్షుల్లో ఫెలరోప్ ఒకటి ఈ పక్షులు దక్షిణ అమెరికా పశ్చిమ తీరం వెంబడి ఆఫ్రికా పశ్చిమ తీరాన ఇండోనేషియా దక్షిణ ప్రాంతంలోను విరివిగా కనిపిస్తాయి వీటి ముక్కు సన్నగా పొడవుగా వుంటుంది దాదాపు పదిహేను సెంటీమీటర్ల ఎత్తుండే ఈ పక్షి జాతిలో ఆడపక్షి మొగ పక్షి కన్నా పెద్దదిగా వుంటుంది

సముద్రపు అలల మీద తేలుతూ నీటిలోని సూక్ష్మ జీవులను చిన్న చిన్న చేపలను పీత రొయ్యలకు సంబంధించిన జీవులను ఆహారంగా తీసుకుంటుంది వీటి ఆహారం తీసుకునే విధానం మన ప్రాంతపు బాతులు ఆహారం తీసుకునే పద్ధతిని పోలి వుంటుంది వీటి పాదాలు ఈదేందుకు లోతు తక్కువ ప్రాంతాలలో నడిచేందుకు అనువుగా వుంటాయి అలల మీద తేలియాడుతూనే నిద్ర పోగలగటం ఈ పక్షి విశేషం

ఇతర పక్షి జాతుల్లో ఆడపక్షులు ఏ విధంగా ప్రవర్తిస్తాయో ఈ ఫెలరోప్‌లలో మొగ పక్షులు అలా ప్రవర్తిస్తాయి ఇది ఒక విధమైన ప్రత్యేకత

ఈ పక్షి జాతిలో జంట కట్టేందుకు చొరవను ఆడపక్షి తీసుకుంటుంది ఇవి గుడ్లు పెట్టే ప్రదేశం ఉత్తర దక్షిణ భూగోళార్ధాలలోని శీతల ప్రదేశాలు ఆ ప్రాంతానికి ముందుగా ఆడపక్షులు చేరతాయి తరువాత అక్కడికి వస్తున్న మొగపక్షులను ఆడపక్షులు ఎంపిక చేసుకుంటాయి

అందంగా బలంగా వున్న మొగపక్షి కోసం ఆడపక్షులు వెతుక్కుంటాయి ఎంచుకున్న మొగ పక్షి వెంటపడి ఎలాగైనా తనతో జంట కట్టమని అనేక భంగిమలలో ప్రాధేయపడుతుంది ఆడపక్షి ఈ ప్రయత్నంలో మరో ఆడపక్షి గనక పోటీ కొస్తే దానిని వెంటపడి తరుముతుంది అరుదుగానే అయినప్పటికి ఒక మొగపక్షి కోసం రెండు ఆడ ఫెలరోప్‌ల యుద్ధం వింతగా వుంటుంది

మొగపక్షిని జంట కట్టేందుకు ఒప్పించిన ఆడపక్షి సురక్షిత ప్రాంతానికి వెళ్ళి ఒదిగి కూచుంటుంది ఈ దశలో మొగపక్షి హెలికాప్టర్‌లా గాలిలో ఎగురుతూ ఆడపక్షితో కలుస్తుంది

కొద్ది రోజులకే ఆడ ఫెలరోప్ గుడ్లు పెడుతుంది గుడ్లు పెట్టడం ముగిసిన మరుక్షణం ఆడ ఫెలరోప్ గూడును గుడ్లను వదిలి వెళ్ళిపోతుంది అక్కడ నుండి గుడ్లను పొదగడం వాటికి ఎగిరే శక్తి వచ్చేవరకు ఆహారం అందించడం అన్నీ మొగ ఫెలరోప్‌యే నిర్వహిస్తుంది గుడ్లు పొదుగుదలలో అవసరమయ్యే వేడిని అందించేందుకు మగపక్షి ఉదర భాగాన రెండు దిమ్మెల వంటివి ఏర్పడతాయి కూడా

ఫెలరోప్‌లో ఆడపక్షి మగలక్షణాలను మగ పక్షి ఆడతనాన్ని చూపించేందుకు గల కారణాలను శాస్త్రజ్ఞులు ఇటీవలే కనుక్కున్నారు మగపక్షికి బాహ్యంగా మగ లక్షణాలున్నప్పటికీ అంతర్గతంగా స్త్రీ జాతిలో ఉత్పన్నమయ్యే హార్మోనులు ఉత్పత్తి అవుతున్నాయి అందువలనే ఈ మొగ ఫెలరోప్‌లో సంతాన క్రియలో తప్పించి మిగిలిన అన్ని విషయాలలోను ఆడ లక్షణాలను చూపిస్తాయి

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

( 12వ పేజీ తరువాయి )

జాతిలో ఒక జాగృతిని మన జీవన సంస్కృతియొక్క సమన్వయాన్ని అందించడానికి మరికొన్ని కొత్త పద్ధతులను క్రొత్త ప్రక్రియలను రాబోయే సంవత్సరాలలో కొంచెం ఆలోచించి ప్రవేశ పెట్టాలి స్త్రీలను విద్యార్థులను మధ్య తరగతి వారిని మేధావులను వీరందరిని పరివ్రాజకాచార్యులను కూడా రంజింపజేయడానికి ఎన్నుకున్న శీర్షిక చాలా బాగున్నది భగవాన్ బాబాగారి ఉపన్యాసాలు వేస్తున్నారు దీని Effect ఏమిటని విమర్శించినట్లయితే మానవ జీవిత సమగ్ర వికాసానికి సంబంధించినటువంటి అంశములకు ప్రాతినిధ్యాన్నిచ్చే ప్రవచనములు ఉయనవి He is bringing a cultural revolution ఆయనను ప్రముఖ విద్యావేత్తగా మనం గౌరవిస్తున్నాం ఆయన చేస్తున్న పనులు గనుక మనం గమనించినట్లయితే స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన విద్యావిధానంలో ఎన్నో మార్పులు తీసుకుని రావాలని భావించాం కాని మనం చేయలేకపోయాం కాని వారు అనుభవంలో చేసి చూపిస్తున్నారు

సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు విద్యావిధానం గురించి తమ రిపోర్టులలో ఎన్నో అంశాలను పేర్కొన్నారు

Education to be complete must be human it must include not only the training of intellect but also the retainment of the heart and Decipline of the spirit మనం మానవత్వాన్ని ఆవాహన చేసుకొనే పద్ధతిలో మొదట విద్యావిధానాన్ని చెప్పగలిగితే అదే ఒక గొప్ప అదృష్టం మనిషి మనిషినిగా గౌరవించ గలిగే తత్వాన్ని విద్య ద్వారా మనం యిస్తున్నామా ? స్వార్థాన్ని విద్యద్వారా పెంచుతున్నామా ? చూడండీ ! బాబా అంటారు ' Competitive worldలో మనిషిని స్వార్థపరునిగా చేస్తున్నావ్ అతడు Education లో Hero లాగా కనపడుతున్నాడు కానీ సాటి మానవుడ్ని మన్నించి గౌరవించే సంస్కృతిలో Zero లాగా కనిపిస్తున్నాడు " హైదరాబాద్‌లో ఒక స్కూలు విషయం చెబుతాను ఆ స్కూలులో కొన్ని సంవత్సరాల క్రితం స్కూలు ఫస్ట్ వచ్చిన విద్యార్థిని ప్రక్క రాష్ట్రంలో Higher Educa ion కు పంపడం జరిగింది ఆ స్కూలు వార్షికోత్సవంలో అతనికి ప్రైజ్ యిద్దామనుకున్నారు ఆ సమయానికి అతను రాకపోవడం వలన అతని తల్లి వచ్చింది ఆ ఉత్సవసమయంలో హెడ్ మాష్టర్ ప్రైజ్ యిస్తుండగా ఆ తల్లి ఏడవడం ప్రారంభించింది " సంతోషించవలసిన తరుణంలో ఎందుకమ్మా ఏడుస్తున్నావ్ " అని హెడ్ మాష్టర్ అడిగాడు అప్పుడు ఆ తల్లి మీ స్కూలులో నా కుమారుడు 90 మార్కులు సంపాదించాడు Higher Educationకు వెళ్ళాడు చదువుతున్నాడు కానీ తల్లిని గౌరవించడం అనేది ఈ చదువు ద్వారా నేర్చుకోలేదు నేను చదువుకున్నప్పుడు మొదట మాతృదేవోభవ ! అని చెప్పేవారు అయితే ఈనాడు అదిలేదు మాతృదేవోభవ అన్నదానికి అతనికి అర్థం తెలియదు మాతృదేవోభవ అన్నదానికి అర్థం తెలియని వానికి యింత ప్రైజ్ యిస్తున్నారని నేను ఏడవాలో నవ్వాలో తెలియక ఏడుస్తున్నాను ' అని ఆతల్లి సమాధానం చెప్పింది తన తల్లిని గౌరవించడం చేతగాని వాడు తన భార్యను కూడా గౌరవించలేడు తన విద్యాలయమును గౌరవించడం చేతకాదు తన ఆఫీసులో నున్న యజమానిని గౌరవించలేడు తన వృత్తిని గౌరవించలేడు వీటన్నింటిని గౌరవించడం చేతగాని వానికి తన దేశాన్ని గౌరవించడంకూడ చేతకాదు ఇది ఈనాటి విద్యావిధానం లోని లోపం అందు వలన బాబా చెబుతారు ' నీదేశాన్ని ప్రేమించడం నీ జన్మ హక్కు నీ ధర్మం నీ కన్నతల్లి ని నీవు ముందు ప్రేమించు కన్న తల్లిని ప్రేమించలేని వాడు కన్న దేశాన్ని ప్రేమించలేడు అంటారు ఈ దేశము తల్లి అనే దానిలో నున్న సాంస్కృతికమైన బంధాన్ని ఎవరు నేర్పారు ? జిజియాబాయి శివాజీకి నేర్పిందని మన చరిత్ర చెబుతున్నది మహాభారత కథలలో తల్లులు నేర్పారని చెప్పుకుంటున్నాం అయితే ఈనాటి తల్లులు డాడీ మమ్మి అనిపించుకుంటున్నారు పసి హృదయాలకు భారతీయ సంస్కృతిలో నున్న సత్యాలను చెప్పడ లేదు కల్లబొల్లి కబుర్లు కట్టుకథలు మాత్రమే

"శ్రీవాణి" జీవితసభ్యురాలు



## శ్రీమతి కాజ వెంకటరమణమ్మ
శ్రీకృష్ణా ఆటోమొబైల్స్ ఎంధనూరు (కర్ణాటక)

చిన్ననాటి నుండి నేర్పుతున్నాం పవిత్రములైన శ్లోకాలను వల్లె వేయించడం లేదు మహానుభావుల చరిత్రలను వివరించడం లేదు మన సంస్కృతి పరంపరల ఔన్నత్యాన్ని చిన్న చిన్న కథల ద్వారా చెప్పడంలేదు చిన్నతనంలో సుమతీ శతకం వేమనశతకం పద్యాలను కంఠస్తం చేయించడం లేదు అందువలన ఎల్లలు భారతీయ సంస్కృతీ విలువలను అవగాహన చేసుకోలేక, మన ఉన్నత సంప్రదాయాలను విస్మరించి అనుకరణ వ్యామోహానికి లోనవుతున్నారు

ఈ సాంస్కృతిక విప్లవమును ఆధ్యాత్మికంగా సామాజిక రంగంలో ఆర్థిక రంగంలో రాజకీయ రంగంలో వైజ్ఞానిక రంగంలో ఆధ్యాత్మికమైన రంగంలో సంవాద రూపంగా వికాసరూపంగా సమాజ చైతన్యంలో సృష్టించాలని ఒక ఉద్యమంగా సాగిస్తున్న బాబావారు ఎందుకు శ్రీవాణిని పోత్సహిస్తున్నారా ? అని ఇందాకటి నుంచి ఆలోచిస్తున్నాను తాను ఆధ్యాత్మికంగా ప్రపంచమంతా సాగిస్తున్న మహా ఉద్యమంలో తెలుగుదేశంలో ఒక పత్రికారూపంగా ఒక చిన్న జ్యోతిని వెలిగించి తన చుట్టూ వున్న చీకటిని తొలగించి సాంస్కృతికమైన విజ్ఞానాన్ని ఈ జాతికి అందించాలని ప్రయత్నం చేస్తున్న శ్రీవాణి – ఇది ఒక పత్రిక కాదు జాతికి విలువ యిస్తున్న మంగళకరమైన వాణి శ్రేయంకరమైన వాణి శుభంకరమైన వాణి జాతికి శ్రీ ఏది ? మొదలు ఏది? మీ సంస్కృతి

చికాగో నగరంలో జరిగిన ప్రపంచ మహా సభలలో స్వామివివేకానంద Dear Brothers & Sisters of America అనగానే కరతాళధ్వనులు మిన్నుముట్టాయి ఆ కొట్టింది భారతీయులు కాదు పాశ్చాత్యలోకం ఎందువలన ? వాళ్ళను ఒకటె స్ఫురించింది మేమందరం అన్నా చెల్లెళ్ళమయితే మా అందరికి ఒక తల్లి వుండాలి ఒక తండ్రి వుండాలి Father hood of god ఈ మానవ జాతికంతటికి ఇది ఒక విశ్వ కుటుంబం ఈ విశ్వ కుటుంబంలో మనమందరం సోదర సోదరీమణులం ఈ ఆధ్యాత్మికమాట ఆ భగవత చైతన్యాన్ని సాంస్కృతికమైన మౌళికమైన ఈ జీవ చైతన్యాన్ని జ్ఞాపకం చేసినటువంటి విశ్వ ప్రేమను జ్ఞాపకం చేసినటువంటి ఆ ఒక్క పిలుపుకే ఆశ్చర్యపోయింది అఖిలప్రపంచం

శ్రీవాణి ఈనాడు ఒక క్రొత్త పిలుపును యిస్తున్నది ఆ పిలుపులో ఆ పత్రిక సమగ్రలక్ష్యం ఆ పేరులోనే వుంది మన రాష్ట్రంలో తెలుగు చదివే ప్రతివారిలో ఒక సాంస్కృతికమైనటువంటి చైతన్యాన్ని తీసుకొని రావాలి ఆ ప్రయత్నాన్ని శ్రీవాణి చేస్తున్నది ఇది వారు ఒక్కరూ చేసేపనికాదు సాంస్కృతిక చైతన్యాన్ని కోరుతున్న ప్రతి రచయిత సహకరించాలి సాంస్కృతిక స్పృహతో రచనలు చేయాలి సమగ్ర మానవ వికాసానికి తోడ్పడే రచనలను అందించాలి ఈ ఆలోచనను ఈ పత్రిక ద్వారా వ్యక్తికరించనట్లయితే శ్రీవాణి ప్రజల సౌభాగ్యానికి, సాంస్కృతిక చైతన్యానికి మరో వాణిగా శుభ వాణిగా తయారవుతుంది ఈ మహత్తర ప్రయత్నానికి సహృదయులైనవారందరూ సర్వవిధములా తోడ్పడుతారని తోడ్పడాలని ఆకాంక్షిస్తున్నాను

(శ్రీవాణి వార్షికోత్సవంలో ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం చేసిన ప్రసంగం నుండి)



# బహుమతులు, విభూతి బాబాగారు ఎందుకు యిస్తారు?

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు తమ భక్తులకు అనేక బహుమతులు విభూతి సృష్టించి యిస్తుంటారు. ఆ మహా నిర్వీత శక్తిని అర్థంచేసుకోలేని వారికి కొండంత అనుమానం. 'అనుమానం పెనుభూతం' అన్నారు బాబాగారు. సంకల్పంతోనే వాటిని సృష్టించడం జరుగుతున్నదనడంలో ఏమాత్రం సందేహంలేదు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం శక్తి పరిమితం. Where science ends there philosophy starts అనే విషయం విస్మరించరాని నగ్న సత్యం. "శాస్త్రం ఆధ్యాత్మికత రెండూ సత్యాన్వేషణతోనే ప్రారంభమవుతాయి. ఆధ్యాత్మికత పూర్ణవలయం. శాస్త్రం అసంపూర్ణం. శాస్త్రం సత్యంలో ఒక భాగాన్ని మాత్రమే అర్థంచేసుకున్నది" అని అంటారు బాబాగారు. బాబాగారి మహాత్తరమైన శక్తిని తెలుసుకోగలగడం అంత తేలికైన విషయంకాదు. ఆయన మానవ రూపాన్ని ధరించిన మహనీయుడు. సాక్షాత్ భగవదాంశ సంభూతుడు అనడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. శ్రీమతి శకుంతల బాలు ఆంగ్లంలో వ్రాసిన 'Living Divinity' అను పుస్తకంనుండి ఈ ప్రశ్నలు సమాధానాల రూపంలో పాఠకులకు అందిస్తున్నాను. మనలో జనించే సహజ సిద్ధమైన అనుమానాలను కొంతవరకు నివృత్తి చేస్తాయని భావిస్తున్నాను. అన్నిటికీ ముఖ్యం విశ్వాసం. 'సంశయాత్మా వినశ్యతి' అని మనకు గీత బోధిస్తున్నది. సంశయము ఉదయించడం సహజం. అయితే సంశయ నివృత్తికోసం ప్రయత్నం చేయడం అత్యవసరం. అది చేయకుండా సంశయముల విషవలయంలో చిక్కుకొని బయటపడటానికి ప్రయత్నించని వాని గతి అధోగతే. ఈ ఒక సంవత్సర కాలంలో బాబాగారి సాన్నిధ్యంలో కొంత సమయం గడిపే సద్భాగ్యం నాకు కలిగింది. ఆ అనుభవాలను శ్రీవాణి నవంబరు డిసెంబరు (1985 సం) ఆగష్టు (1986) డిసెంబరు (1986) జనవరి (19 7) సంచికలలో పాఠకులకు అందించాను. బాబాగారు సాంస్కృతిక ఆధ్యాత్మిక విలువలను పరిరక్షించడానికి చేస్తున్న కృషి బాలబాలికలలో నైతిక ఆధ్యాత్మిక శీల సంపత్తును పెంపొందింపజేయడానికి చేస్తున్న ప్రయత్నం అద్వితీయమైనది. ఇటువంటి మహత్తర ప్రయత్నాన్ని మరెవరూ ప్రపంచంలోనే చేయడంలేదనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ప్రశాంతినిలయం సందర్శించినవారికి ఈ యదార్థనగ్న సత్యం బోధపడుతుంది. చూడనివారికి అర్థం కావడం చాలా కష్టం. సహృదయులైన పాఠకులు సత్యాన్వేషణ కోసం కృషి సల్పుతారని ఆశిస్తున్నాను. — సం

## ప్రశ్నోత్తర మాలిక

ప్రశ్న: మంచి పనులుగానీ, చెడు పనులుగానీ తరువాతి జన్మకు ఎలా తీసుకొని పోబడగలవు?

స్వామి: 'శ్వాస పనులను తీసుకొనివెళుతుంది. ఎందువలననగా, ఒక వ్యక్తి మరణించినప్పుడు శ్వాస ఆగిపోతుంది. శరీరము మాత్రము చావు తర్వాత కూడా ఉంటుంది. అయితే మనం దానిని 'శవం' అంటున్నాము. పనికిరానిదిగా భావించి దానిని దహనం చేస్తున్నాము. కనుక శరీరం దేనినీ తీసుకొనిపోలేదు. ఏ పూవైనా తన వాసనను తాను తీసుకొనిపోలేదు. అలాగే శరీరం కూడా

పూవుయొక్క వాసనను గాలి మోసికొనిపోయి అందరికీ అందజేస్తుంది ఒక మునిసిపాలిటీ లారీ దుర్వాసనను మోసికొని వస్తుంది అదే విధంగా శ్వాస మంచి పనులను గానీ చెడ్డపనులనుగానీ తరువాతిజన్మకు తీసికొనిపోతుంది ఇవి కనిపించని కంఠమాలలాగా నిన్ను చుట్టుకొని ఉంటాయి నీ జీవిత సరళిని ఈ కంఠమాల నిర్ణయిస్తుంది అది మంచి వాసనగానీ చెడువాసనగానీ కావచ్చు అందుచేత మానవుడు తాను చేసే ప్రతి పనికీ ప్రతిక్రియ ప్రతిధ్వని ప్రతిబింబము ఉంటుందని గ్రహించాలి తన కర్మను మానవుడు తానే తన చర్య ద్వారా తన నొసట వ్రాసుకొంటున్నాడు మంచి ఆలోచనలతోను మంచి పనులతోను మంచి జీవితాన్ని గడపడం చాలా అవసరం అట్టి జీవితంద్వారానే మానవుడు తనలోని దివ్యత్వాన్ని గ్రహించగలడు "అహం బ్రహ్మాస్మి" అనే భావం కూడా పూర్తిగా సరైనది కాదు ఇందులోకూడా ద్వైత భావన ఉన్నది నేను బ్రహ్మను అనడంలో నేను బ్రహ్మ వేర్వేరు అనే భావన ధ్వనిస్తున్నది ఆ వాక్యం "అహం అహం" ( నేను నేనే ) అని ఉండాలి

ప్రశ్న భగవంతుడు ప్రపంచంలో ఉన్న క్రూరత్వాన్ని ఎందుకు నిరోధించడు ?

స్వామి భగవంతుడు సాక్షీభూతుడు మాత్రమే తాను ఏమీ చేయడు మానవుడు తన బుద్ధి చెప్పినట్లుగా వ్యవహరిస్తాడు తాను చేసిన కర్మల ఫలితాన్ని తానే అనుభవిస్తాడు భగవంతునికి మంచి చెడు రెండూ లేవు ఉదాహరణకు ఒక కత్తిని తీసికొందాం హంతకుడు కత్తిని మరొకరిని హత్యచేయడానికి ఉపయోగిస్తాడు కసాయి వాడు కత్తిని జంతువులను చంపడానికి వాడుతాడు డాక్టరు కత్తిని రోగికి ఆపరేషన్ చేయడానికి ఉపయోగిస్తాడు వంటవాడు కూరలు తరగటానికి ఉపయోగిస్తాడు ఇవన్నీ కత్తులే వీటిని అయస్కాంతం దగ్గర పుంచితే, అది అన్ని కత్తులను సమానంగా ఆకర్షిస్తుంది అది చేసే పనులనుబట్టి ఆకర్షణలో తేడావుండదు భగవంతుడు అయస్కాంతం లాంటివాడు ఆయనకు అన్ని కత్తులూ సమానమే అయినప్పటికీ కత్తులు చేసే పనులనుబట్టి ఆ యా వ్యక్తులు సత్ఫలితాలను లేదా దుష్ఫలితాలను అనుభవించవలసి వస్తుంది

ప్రశ్న నిన్నటి రాజకీయాలకు, నేటి రాజకీయాలకు తేడా ఏమిటి ?

స్వామి రాజకీయాల్లో ప్రస్తుత పరిస్థితిని ఎగుడు దిగుడు "(Bumps and Jumps)"గా వర్ణించవచ్చును ఉదాహరణగా నీ శరీరాన్ని అందులోని భాగాలను తీసుకో శరీర నిర్మాణంలో ప్రతిభాగం లేదా అవయవం ముఖ్యం అన్ని అవయవాలు కలిస్తేనే దేహం అవుతుంది అలాగే దేశంలో కూడా ప్రతి విషయాన్ని గురించి శ్రద్ధ తీసుకోవాలి దేశం దేహం లాంటిదే అందులోని ప్రతి భాగాన్ని గురించి జాగ్రత్త వహించాలి అదే భారతీయ సంస్కృతి మన ప్రజలు అది మరచిపోయారు ప్రాచీన కాలంలో రాజకీయ నాయకులు దానిని మరచిపోలేదు

ప్రశ్న స్వామి ఎందుకు బహుమతులను సృష్టించి ఇస్తున్నారు ?

స్వామి ఉంగరాలు గానీ పతకాలు (pendants) గానీ స్వామియొక్క ప్రేమకు చిహ్నాలు బహుమతులతో మనుష్యులను తన వద్దకు ఆకర్షించాలని స్వామి ఉద్దేశ్యం కాదు నీ బిడ్డపై నీకున్న ప్రేమను నీవు ప్రదర్శించాలనుకుంటే లేదా నీవెవరినైనా సంతోషపెట్టదలచుకుంటే నీవు వారికి ఏదో ఒక బహుమతి యిస్తావుగదా ? అదే విధంగా స్వామికూడా ఆనందాన్ని పంచి పెట్టాలనుకుంటారు

ప్రశ్న స్వామి ఇచ్చిన బహుమతి (రక్షరేకు) తాయెత్తు (Talisman) గా పని చేస్తుందా ?

స్వామి అవును అవి నా విజిటింగ్ కార్డ్సు (Visiting-Cards) అవి ఇచ్చిన వారికి ఏదైనా ప్రమాదం సంభవించినా వారికి నా సహాయం అవసరమైనా ఆ బహుమతులు మెరుపులాగా నాకు ఆ విషయాన్ని తెలియజేస్తాయి ఒక్కొక్కప్పుడు ఈ బహుమతులు ఏదో ఒక ప్రత్యేక

ఉద్దేశ్యంతో ఇవ్వబడుతాయి భక్తుని ఆరోగ్యంకొరకు లేదా నేనిచ్చే ఉంగరములోని రాయి నుండి వెలువడే కిరణాలు భక్తుని మీద సర్వదా వాటి ప్రభావంతో అతనిని సన్మార్గంలో ఉంచడానికి ఉపయోగపడుతాయి అనగా స్వామి ఏది చేసినప్పటికీ ఒక ఉద్దేశ్యంతోనే చేస్తాడు కారణం లేకుండా స్వామి ఏమీచేయడు

ప్రశ్న స్వామి విభూతి ఎందుకు ఇస్తాడు ?

స్వామి పూలు పండ్లు ఆకులు ఇంకా ఇతర తినే పదార్థాలు తాత్కాలికమైనవి ఎక్కువకాలం నిల్వచేస్తే వాటిల్లో కూడా పురుగులు పుడతాయి ఎంతకాలమైనా మార్పుచెందకుండా ఉండే విభూతి మాత్రమే విభూతి పంచభూతాల అంతిమ రూపం మన కోరికలు బూడిద కావాలి ఈ విధమైన త్యాగానికి వైరాగ్యానికి విభూతి చిహ్నం మన మనస్సు కోరికలు అనుబంధాలు లెకుండా చివరకు మిగిలే భస్మము (విభూతి) లాగా తయారవాలి అలాంటి నిర్మలమైన మనస్సునే మనం భగవదర్పితం చేయాలి

ప్రశ్న పూజలు, అనుష్ఠానాలువిధిగాచేయాలా?

స్వామి ప్రతిదీ ఆ వ్యక్తినిబట్టి ఉంటుంది ఏదైనా అచంచలమైన భక్తి విశ్వాసాలతో చేయాలి కేవలం బాహ్యకర్మలతో భగవంతుని మోసం చేయలేము

ప్రశ్న స్వామి స్త్రీలపై ఎక్కువ నిషేధాలను ఎందుకు విధించారు ? వారికి స్వామి సన్నిధికి ప్రవేశావకాశాలు చాలా తక్కువ

స్వామి స్వామి వద్దకు రావడానికి అందరికీ అవకాశం సమానమే ఈ అవకాశం స్త్రీ పురుష భేదంపై ఆధారపడి ఉండదు ప్రతివారికీ వారి వారి అవసరాన్ని బట్టి భక్తిని బట్టి వారి పనిని బట్టి ఆ అవకాశం ఉంటుంది

ప్రశ్న స్వామి అలా అన్నా స్త్రీలు స్వామి సన్నిధికి రావాలంటే చాలా అవరోధాలు అధిగమించ వలసి వస్తోంది

స్వామి అని స్త్రీలు అనుకుంటారు ! సమూహంలో నా ప్రక్కనే ఉన్న వ్యక్తి ఒక్కొక్కసారి నా దృష్టిలోకి రాడు దూరంగా ఉన్నవాడు నా దృష్టిని ఆకర్షిస్తాడు ఇదంతా ఎప్పుడు ఎవరు ఎంత అనుగ్రహాన్ని పొందాలనే దానిమీద ఆధారపడి ఉంటుంది స్త్రీ పురుష భేదాన్ని బట్టి కాదు పైగా ఇవి మీ దృష్టికి మాత్రమే గోచరిస్తాయి స్త్రీలకు పురుషులకు ఆత్మ విషయంలో తేడా లేదు ఆత్మ నిత్యం పరిశుద్ధం దివ్యచైతన్యం స్వయంప్రకాశం ఆత్మకు లింగభేదం లేదు ఈ భేదాలు దేహానికి మాత్రమే

ప్రశ్న శూన్యం నుండి, ఏదీ ఉద్భవించదని శాస్త్రజ్ఞులు అంటారు కదా ?

స్వామి నిజమే అయితే వారు శూన్యం అనుకుంటున్నది శూన్యం కాదు విశ్వంలో శూన్యమనేది లేదు శాస్త్రజ్ఞుల దృష్టి పరిమితం కాబట్టి వారు అలా అంటారు వారు అన్ని విషయాలు చూడలెరు అర్థం చెసుకోలేరు శాస్త్రం ఆధ్యాత్మికత రెండూ సత్యాన్వేషణతోనే ప్రారంభమవుతాయి ఆధ్యాత్మికత పూర్ణమయం శాస్త్రం అసంపూర్ణం (ఇంగ్లీషులో O C లాంటివి) శాస్త్రం సత్యంలో ఒక భాగాన్ని మాత్రమే అర్థం చేసుకొన్నది ఇది పిడికిలిలో ఉన్న రుమాలులాంటిది మనకు కనపడేది కొద్ది కనపడనిది ఎక్కువ



"శ్రీవాణి" జీవితసభ్యులు



శ్రీ మహంకాళి సూర్యప్రకాశరావు
మిల్లర్ & కిరాణా మర్చంట్
నందిగామ

Postal Registered SREE VANI Regd with Registrar of News Papers
No H/MPM/34 Dt 10-12-84 No RN 000121/20/AL/85 NT III